జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# ఆత్మసాక్షాత్కారం

మూల గుజరాతి సంకలనం - డా.నీరు బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మగణం

**ప్రకాశకులు** : అజీత్ సి.పటేల్
దాదా భగవాన్ విజ్ఞాన్ ఫౌండేషన్
1, వరుణ్ అపార్ట్‌మెంట్, 37,శ్రీమాలి సొసైటీ
నవరంగ్‌పురా పోలీస్ స్టేషన్ ఎదురుగా,
నవరంగ్‌పురా, అహ్మదాబాద్ - 380009
గుజరాత్, భారత్
**ఫోన్:** + 91 79 3500 2100



**First Edition** : June 2024 (500 copies)

**భావ మూల్యం** : 'పరమ వినయం', మరియు "నాకు ఎంతమాత్రం తెలియదు. అదే భావన

**Price** : Rs. 45

**ముద్రిక** : అంబా మల్టి ప్రింటింగ్
B-99, ఈల్కెట్రానిక్స్ GIDC
క-6, రోడ్డు సెక్టర్-25
గాంధీనగర్ - 382044
గుజరాత్, India
**ఫోన్:** +91 79 3500 2142

**ISBN/eISBN** : 978-93-91375-62-1

**Printed in India**

# త్రిమంత్రం

(సర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)





నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





# దాదా భగవాన్ ఎవరు?

అది జూన్ 1958 లో ఒక సాయంత్రం సమయం సుమారు 6:00, ప్రదేశం రద్దీగా ఉన్న సూరత్ పట్టణ రైల్వే స్టేషన్‌లో ప్లాట్‌ఫార్మ్ నం.3.లో బెంచీ మీద కూర్చునివున్న శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్ అనే దేహమందిరంలో, ప్రకృతిపరంగా, అక్రమ రూపంలో, ఎన్నో జన్మలుగా వ్యక్తమయ్యేందుకు ఆత్రుతగా ఎదురుచూస్తున్న 'దాదా భగవాన్' పూర్ణ రూపంలో ప్రకటితమయ్యారు, ఆధ్యాత్మిక అద్భుతంలా. ఒక గంట సమయంలోనే ఆయనకు విశ్వ దర్శనం అయింది. "నేనెవరు? భగవంతుడు ఎవరు? విశ్వాన్నంతా ఎవరు నడిపిస్తున్నారు? కర్మ అంటే ఏమిటి? ముక్తి అంటే ఏమిటి?" ఇలాంటి ప్రపంచంలో ఆధ్యాత్మిక ప్రశ్నలన్నిటికీ సమాధానం వచ్చింది. ఈ విధంగా దైవం, విశ్వానికి సంబంధించిన ఒక అద్వితీయమైన పూర్ణ స్వరూప దర్శనం కావించింది, దాని ఫలస్వరూపమే శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్, గుజరాత్‌లోని చరోతర్ క్షేత్రంలోని భాదరణ్ గ్రామంలో పాటీదార్, ఒక కాంట్రాక్ట్ పని చేసే వ్యక్తి, అయినా కూడా సంపూర్ణ వీతరాగ పురుషుడు.

"వ్యాపారంలో ధర్మం పాటించాలి కాని, ధర్మాచరణలో వ్యాపారం చేయగూడదు" అనే సిద్ధాంతంతోనే ఆయన జీవితమంతా గడిపారు. ఆయన ఎప్పుడూ ఎవరి దగ్గరి నుంచీ డబ్బు తీసుకోలేదు సరికదా తన ఆదాయం నుంచే తీర్థయాత్రలు చేసే భక్తులకు ఆర్థిక సహాయం చేసారు.

ఆ విధంగా ఆయనకు కేవలం రెండు గంటలలోనే సిద్ధించిన అద్భుతమైన జ్ఞానాన్ని ఉపయోగించి, ఆయన ఎందరో ముముక్షువులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించారు. దాన్ని ఆయన అక్రమ మార్గం అని అన్నారు. అక్రమ అంటే ఒక క్రమం లేని అర్థం. క్రమం అంటే ఒక మెట్టు పైన మరో మెట్టుని క్రమంగా ఎక్కుతూ వెళ్ళటం. అక్రమ మార్గమంటే షార్ట్‌కట్‌లో లిఫ్ట్ ద్వారా పైకి చేరుకోవటం.

ఆయన "దాదా భగవాన్ ఎవరు" అన్న రహస్యాన్ని స్వయంగా చెప్తూ, "మీ ముందు కనిపిస్తున్న ఈ ఆకారం దాదా భగవాన్ కాదు. ఈయన ఎ.ఎమ్.పటేల్. మేము ఒక జ్ఞానపురుషుడను, లోపల ప్రకటితమైనది దాదా భగవాన్. దాదా భగవాన్, 14 లోకాలకు నాధుడు. ఆయన మీలో కూడా ఉన్నాడు. అందరిలోనూ ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, నాలో సంపూర్ణ రూపంలో వ్యక్తమై ఉన్నాడు. ఆ దాదా భగవాన్ గారికి నేను కూడా ప్రణామం చేస్తాను".

# ఆత్మజ్ఞానానికి ప్రత్యక్ష లింక్

"నేను నా చేతులతో కొందరికి సిద్ధిని ప్రసాదించబోతున్నాను. నా తర్వాత ముందుకు నడిపేవాళ్ళు ఉండాలి కదా! నా తర్వాత కూడా మనుషులకు మార్గం చూపించేవాళ్ళుండాలి కదా!"

–దాదాశ్రీ

పరమ పూజ్య దాదాశ్రీ పల్లెపల్లెకు దేశవిదేశాలలో తిరుగుతూ ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగిస్తూవచ్చారు. వీరు తమ జీవితకాలంలోనే పూజ్య డా.నీరు బెహన్ అమీన్ (నీరూ మా) కి ఆత్మజ్ఞానాన్ని కలిగించి జ్ఞానసిద్ధిని ప్రసాదించారు. దాదాశ్రీ దేహాన్ని చాలించిన తర్వాత నీరూ మా, ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని నిమిత్త భావనతో చేస్తూవస్తున్నారు. పూజ్య దీపక్ భాయ్ దేశాయ్‌కి దాదాశ్రీ, సత్సంగాన్ని నిర్వహించే సిద్ధిని ప్రసాదించారు. నీరు మా సమక్షంలోనే, ఆమె ఆశీర్వాదంతోనే పూజ్య దీపక్ భాయి దేశవిదేశాలలో ఎన్నో ప్రాంతాలకు వెళ్ళి, ముముక్షువులకు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించి వచ్చారు. ఆ పని ఇప్పటికీ నీరూమా దేహాంతం తర్వాత కూడా కొనసాగుతూనేవుంది. ఆత్మజ్ఞాన ప్రాప్తి తర్వాత ఎందరో ముముక్షువులు ప్రపంచంలో ఉంటూ, తమ తమ బాధ్యతలను సక్రమంగా నెరవేరుస్తూ, ముక్త పురుషులుగా ఆత్మానందాన్ని అనుభవిస్తున్నారు.

ఈ గ్రంథంలో ముద్రితమైన వాణి, మోక్షార్థుల మార్గదర్శనంలో ఎంతో ఉపయోగకరం. కానీ, మోక్షప్రాప్తి కోసం ఆత్మజ్ఞానాన్ని పొందటం అవసరం. అక్రమ మార్గంలో ఆత్మజ్ఞానాన్ని పొందేందుకు ఇప్పటికీ మార్గం తెరిచేవుంది. దీపకళిక మరో దీపాన్ని వెలిగించినట్లుగానే, ప్రత్యక్షంగా ఆత్మజ్ఞాని నుంచే ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించుకొని తన ఆత్మను జాగృతం చేసుకోవచ్చు.

## దాదా భగవాన్ నిర్వచించిన

# ఆత్మసాక్షాత్కారం

## 1. మానవుని జీవిత లక్ష్యమేమిటి?

లైఫంతా ఫ్రాక్చరైపోయింది. ఎందుకు బ్రతుకుతున్నామన్నదే తెలియదు. అదే తెలియనప్పుడు జీవిత లక్ష్యమేమిటన్నది అర్థరహితమైన ప్రశ్న అవుతుంది. సంపద చేతికి వస్తుంది, తిని, తాగి విలాసంగా గడుపుతాం, కానీ రోజంతా చింతలోనే గడుపుతాం. దాన్ని జీవితలక్ష్యమంటామా? మానవ జీవితం లభించింది, దాన్ని వ్యర్థం కానివ్వద్దు అంటే దాని అర్థమేమిటి? మానవ జన్మ లభించిన తర్వాత లక్ష్యం వైపు నడిచి చేరుకోవటానికి ఏం చెయ్యాలి? ప్రపంచంలో సుఖంగా జీవించాలంటే, శారీరక సుఖాలను పొందాలంటే, మీ దగ్గరున్న దాన్నంతా ప్రజలకు పంచిపెట్టు.

ప్రపంచంలోని నియమం ఒక్కటేనని తెలుసుకో. అన్ని మతాల సారం కూడా ఒక్కటే. అదేమిటంటే, "మనిషి సుఖాన్ని కోరుకుంటే, ఇతర ప్రాణులకు సౌఖ్యాన్ని కలుగజేయాలి. దు:ఖమే కావాలనుకుంటే వాళ్ళకి దు:ఖాన్ని కలుగజేయి". మీకు ఏది అనుకూలమనిపిస్తే అది చేయండి. నా దగ్గర డబ్బులు లేవు కదా, నేను ఇతరులకు సౌఖ్యాన్ని ఎలా ఇవ్వగలను అని కొందరు అడుగుతారేమో! కేవలం డబ్బులతోనే ఇతరులకు సౌఖ్యాన్ని కలుగజేస్తారనేది

సరి కాదు. ఇతరుల పట్ల ఒబ్లైజింగ్ నేచర్ (ఉపకారం చేసే స్వభావం) కలిగివుండవచ్చు. వాళ్ళకి ఏదైనా సహాయం చేయవచ్చు. ఏదైనా తెచ్చిపెట్టాలంటే తెచ్చిపెట్టవచ్చు, సలహాసూచనలు ఇవ్వవచ్చు, అలా ఒబ్లైజ్ చేయటానికి సవాలక్ష మార్గాలున్నాయి.

## లక్ష్యాలు ప్రాపంచకం, ఆత్మపరమైనవి అని రెండు రకాలు

రెండు రకాల లక్ష్యాలను పెట్టుకోవాలి. భౌతిక ప్రపంచంలో ఎవరికీ కష్టం కలిగించకుండా నడుచుకుంటాను, ఎవరికీ దు:ఖాన్ని కలుగజేయని అని అనుకోవాలి. ఈ విధంగా మనం మంచి మనుషులతో సత్సంగం చేస్తాము కానీ దుస్సాంగత్యం చేయము అన్న ధ్యేయంతో నడుచుకోవాలి. మరో లక్ష్యం ఏమిటంటే, ప్రత్యక్ష జ్ఞాని పురుషులు తారసపడితే, వారి నుండి ఆత్మజ్ఞానాన్ని గ్రహించి, వారితో సత్సంగం చేస్తూవుండటం. దానివలన మీ పనులన్నీ నెరవేరుతాయి. మీ జీవితంలోని పజిల్ సాల్వ్ అయిపోతుంది, మోక్ష ప్రాప్తి లభిస్తుంది.

మనిషికి అంతిమ లక్ష్యమేమిటి? మోక్ష ప్రాప్తిని పొందటం అన్నదే లక్ష్యంగా పెట్టుకోవాలి. మీరు కూడా మోక్షాన్ని పొందాలనే అనుకుంటున్నారు కదా! ఎంతకాలం ఇలా తిరుగుతూవుంటారు? అనంత కోటి జన్మల నుంచి తిరుగాడుతూనేవున్నారు. ఆ తిరుగులాటలో ఇంకా ఏమైనా మిగిలిందా? అసలెందుకలా తిరుగుతున్నారు. ఎందుకంటే, "నేనెవరిని" అన్నది తెలుసుకోలేదు కనుక. స్వస్వరూప జ్ఞానమే లేకుండాపోయింది. మీ నిజస్వరూపమేమిటో మీకు తెలియాలి కదా. మీరెవరో మీకు తెలియాలా వద్దా? ఇంతకాలం తిరిగినా మీరెవరో మీకు తెలియలేదు కదా. కేవలం డబ్బు సంపాదనలోనే మునిగివున్నారా? మోక్షం కోసం కూడా ఏమైనా కొంత చెయ్యాలా వద్దా? నిజానికి మానవుడు భగవంతుడవగలుగుతాడు. ఆ పరమాత్మ స్థితిని చేరుకోవటమే మానవునికి అన్నిటికన్నా అంతిమ లక్ష్యం.

## మోక్షం రెండు స్టేజీలలో

**ప్రశ్నకర్త:** మోక్షమంటే సామాన్యంగా అర్థం చేసుకునేదేమిటంటే, జనన మరణాల నుండి విముక్తి కలగటం అని.

**దాదాశ్రీ:** ఔను అది నిజమే కాని అది అంతిమ ముక్తి. అది సెకండరీ స్టేజ్‌లో చేరుకునేది.  కాని దానికంటే ముందు స్టేజ్ ఉంది. అది ప్రాపంచిక దు:ఖాలను కూడా లేకుండా చేస్తుంది. ప్రాపంచిక దు:ఖాలు మిమ్మల్ని అంటకుండా ఉండటం, ఉపాధిలో కూడా సమాధి ప్రాప్తించటం, ఇది మోక్షంలో మొదటి దశ. శరీరం వదిలిపెట్టినపుడు అది చివరకు కలిగే మోక్షమే కాని, ఇక్కడ జీవించి ఉన్నపుడే మోక్షం పొందగలగాలి. నాకు మోక్షం వచ్చింది కదా! ప్రపంచంలో ఉంటూనే ప్రాపంచిక విషయాలను అంటనివ్వగూడదు. అటువంటి మోక్షం కలగాలి. ఇదంతా అక్రమ్ విజ్ఞానంతో సంభవం అవుతుంది.

## 2. ఆత్మజ్ఞానంతో శాశ్వత సుఖ ప్రాప్తి

జీవి ఎల్లప్పుడు వెతికేది దేనికోసం? ఆనందాన్ని. కానీ, క్షణకాలం కూడా ఆనందం లభించటం లేదు. వివాహమహోత్సావలకు వెళ్ళండి, లేదా నాటకాల వంటి వినోదాలకు వెళ్ళండి కాని, చివరకు మళ్ళీ దు:ఖం అనేది తిరిగి వచ్చేస్తుంది. ఏ సుఖం తర్వాత తిరిగి దు:ఖం వచ్చేస్తుందో దాన్ని సుఖమని ఎలా అనగలం? సుఖమనేది పర్మనెంటుగా ఉంటుంది. ఇవన్నీ తాత్కాలికానందాలు, కాల్పనికమైనవి, ఉన్నాయని నమ్ముతున్నవి. ప్రతి ఒక్క ఆత్మ వెతికేది ఏమిటి?  ఎప్పటికీ ఉండే శాశ్వతమైన సుఖాన్ని వెతుకుతుంటుంది. 'అది ఇందులో దొరుకుతుందేమో, అందులో దొరుకుతుందేమో.  దీన్ని తీసుకోనా, ఇట్లా చేయనా, ఒక బంగ్లా కట్టుకుంటే సుఖం లభిస్తుందేమో, వాహనం కొనుక్కుంటే సుఖం లభిస్తుందేమో' ఇలా అనుకుంటూవుంటుంది. కానీ అదేమీ దొరకదు సరికదా ఇంకా చిక్కుల్లో పడటం జరుగుతుంది.  సుఖమనేది మీ

లోపలే ఉంది. ఆత్మలోనే ఉంది. అంటే, ఆత్మ అనేదాన్ని పట్టుకుంటే (సనాతన) సుఖం కూడా దొరుకుతుంది.

## సుఖదు:ఖాలు

ప్రపంచంలో అందరూ సుఖాన్నే వెతుకుతుంటారు. కానీ సుఖమంటే ఏమిటో మాత్రం తెలుసుకోరు. సుఖం అనేది ఎలా ఉండాలంటే, అది పొందిన తర్వాత తిరిగి మళ్ళీ దు:ఖమనేదే దరికి రాగూడదు. అలాంటి సుఖమేదైనా ఈ ప్రపంచంలో ఉంటే, దాన్ని వెతికి పట్టుకో పో! శాశ్వతమైన సుఖమైతే స్వయంగా నీలోనే ఉంది. నీవే అనంతమైన సుఖానికి నిలయమైతే మనుషులంతా నశ్వరమైన విషయాలలో సుఖాన్ని వెతకటంలో పడ్డారు.

## సనాతన సుఖం కోసం అన్వేషణ

సనాతన సుఖం కనక సంప్రాప్తమైతే, ఆ మనిషికి ప్రాపంచిక దు:ఖమనేదే అంటుకోకుండా ఉంటే, ఆత్మ ముక్తిచెందుతుంది. సనాతన సుఖమే మోక్షం. ఇతర మోక్షాలు మనకెందుకు? మనకి కావలసింది సుఖం. మీకు సుఖంగా ఉండటమంటే ఇష్టమేనా, ఈ సంగతి చెప్పండి ముందు.

**ప్రశ్నకర్త:** దానిగురించే కదా ప్రయత్నమంతా.

**దాదాశ్రీ:** ఔను కానీ ఆ సుఖం టెంపరరీ అయితే బాగుండదు. ఆ సుఖం తర్వాత మళ్ళీ దు:ఖం వస్తుంది కనుక అది బాగనిపించదు. సనాతన సుఖమైతే దు:ఖం మళ్ళీ రాదు కనుక అలాంటి సుఖమే కావాలి. అటువంటి సుఖమే కనుక లభిస్తే, అదే మోక్షం. మోక్షమంటే అర్థమేమిటి అని అంటే, ప్రాపంచిక దు:ఖాలు అంటకపోవటం, అదే మోక్షమంటే అంటారు. లేకపోతే దు:ఖం తెలియకపోవటమనేది ఎవరికీ ఉండదు.

ఒకటేమో బాహ్యంలోని జ్ఞానం. దాన్ని సైంటిస్ట్‌లు స్టడీచేస్తునేవుంటారు కదా! రెండవదాన్ని అంత:కరణంలోని జ్ఞానమంటారు. అది సనాతన సుఖం వైపు నడిపిస్తుంది. అంటే, ఏదైతే సనాతన సుఖ ప్రాప్తి కలిగిస్తుందో, అదే

ఆత్మవిజ్ఞానం అనిపించుకుంటుంది. కానీ టెంపరరీ అడ్జస్ట్‌మెంట్ సుఖాన్ని ఇప్పించేదంతా బాహ్య విజ్ఞానమనిపించుకుంటుంది. బాహ్య విజ్ఞానం చివరకు వినాశకారి. అది వినాశనాన్నే కలిగిస్తుంది. ఈ అక్రమ విజ్ఞానం సనాతనమైనది, సనాతనం కలిగించేది.

## 3. I and My are separate
## జ్ఞాని మాత్రమే మౌలికమైన స్పష్టీకరణను కలుగజేయగలడు

I అనేది భగవంతుడు, My అనేది మాయ. My అనేది I కి అనుబంధమైనది. I అనేది సత్యం. ఆత్మ గుణాలను ఈ I లో ప్రతిపేక్షించుకో. అలా చేసినా మీలోని శక్తులు బాగా పెరుగుతాయి. మౌలికమైన ఆత్మ కేవలం జ్ఞానికి తప్ప మరెవరికీ లభించదు. కానీ ఈ I, My రెండూ పరస్పరం భిన్నమైనవి. ఇది అందరికీ అలాగే వుంటుంది. ఫారినర్స్‌కి కూడా ఇది అర్థమైతే వాళ్ళ బాధలు చాలవరకు తగ్గిపోతాయి. ఇది సైన్సు. అక్రమ విజ్ఞానానికి చెందిన ఈ ఆధ్యాత్మిక రిసెర్చ్ ఒక నవీన విధానం. I అనేది స్వయం అనే భావం. My అనేది యాజమాన్య భావం.

## I and My రెండిటినీ సెపరేట్ చేయి

ఒక సెపరేటర్‌తో మీరు I ని, My ని సెపరేట్ చేయమని అంటే మీరు సెపరేట్ (వేరు) చెయ్యగలరా? I, My లను సెపరేట్ చెయ్యాలా వద్దా? ప్రపంచంలో ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకోవాలి కదా. I, My లను సెపరేట్ చెయ్యండి. పాలకి సెపరేటర్ ఉన్నట్టుగా, దానితో వెన్నని వేరు చేస్తారు కదా! అలాగే దీన్నీ వేరు చేయాలి.

మీ దగ్గర My అనేదేమైనా ఉందా? ఒంటరిగా I యేనా లేక వెంట My కూడా ఉందా?

**ప్రశ్నకర్త:** My వెంట ఉంది కదా!

**దాదాశ్రీ:** ఏంటేంటి మీ దగ్గర My ఉందా?

**ప్రశ్నకర్త:** నా ఇల్లు, అందులో ఉన్న నా వస్తువులు అన్నీ.

**దాదాశ్రీ:** అన్నీ మీవేనంటారా? మీ భార్య ఎవరిది అంటారు?

**ప్రశ్నకర్త:** ఆమె కూడా నాదే!

**దాదాశ్రీ:** మరి పిల్లలు ఎవరివారు?

**ప్రశ్నకర్త:** వాళ్ళూ నావాళ్ళే.

**దాదాశ్రీ:** ఆ గడియారం ఎవరిది?

**ప్రశ్నకర్త:** అదీ నాదే.

**దాదాశ్రీ:** మరి ఈ చెయ్యి ఎవరిది?

**ప్రశ్నకర్త:** ఈ చెయ్యి కూడా నాదే.

**దాదాశ్రీ:** అయితే నా తల, నా శరీరం, నా కాళ్ళు, నా చెవులు, నా కళ్ళు అని కూడా అంటారు. ఈ శరీరం కూడా అన్ని వస్తువులనీ 'నావి' అంటుంది. మరి 'నావి' అనే ఆ 'మీరు' ఎవరు? ఇది ఎప్పుడైనా ఆలోచించారా? My నేమ్ ఈజ్ చందూ భాయ్ (చందూ భాయ్ అనే చోట మీ పేరు చెప్పుకోండి). అలా అని చెప్పి, 'నేను చందూభాయ్' ని అనండి. ఇందులో ఏమైనా విరుద్ధ భావం ఉందా?

**ప్రశ్నకర్త:** ఉంది.

**దాదాశ్రీ:** మీరు చందూ భాయ్. ఇందులో I, My రెండూ ఉన్నాయి. ఈ I, My ల రెండు రైల్వే లైన్లు విడివిడిగానే ఉంటాయి. సమాంతరంగా ఉంటాయి కానీ ఎప్పటికీ కలవవు. అయినా మీరు ఈ రెండిటినీ కలిపే చూస్తారు. దీన్ని అర్థం చేసుకుని అందులోంచి My ని సెపరేట్ చేయండి. మీలో ఉన్న ఆ My ని ఒక పక్కకు పెట్టండి. My హార్ట్, అయితే దాన్ని ఒక పక్కకు పెట్టండి. ఈ శరీరంలోంచి అలా దేన్నిదేన్ని సెపరేట్ చేయాలి ఇంకా?

**ప్రశ్నకర్త:** కాళ్ళు, ఇంద్రియాలు!

**దాదాశ్రీ:** ఔను అవన్నీ. పంచేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనసు-బుద్ధి-చిత్తం- అహంకారం అలా అన్నిటినీ. My ఇగోయిజమ్ అంటారా లేక I ఇగోయిజమ్ అంటారా?

**ప్రశ్నకర్త:** My ఇగోయిజమ్.

**దాదాశ్రీ:** My ఇగోయిజమ్ అనగలిగితే దాన్ని కూడా సెపరేట్ చెయ్యగలరు. కానీ ఆ తర్వాత మీ భాగం ఏముంటుంది? అది మీకు తెలియదు. అందుకే సంపూర్ణంగా సెపరేషన్ జరగదు. మీరు మీ గురించి ఒక హద్దు వరకే తెలుసుకోగలరు. స్థూలంగా కనిపించే వస్తువులనే మీరు గుర్తిస్తారు కానీ సూక్ష్మ వస్తువులను గుర్తించరు. సూక్ష్మంగా ఉన్నదాన్ని వేరు చేయటం, సూక్ష్మతరమైనదాన్ని వేరుచేయటం, తర్వాత సూక్ష్మతమమైనదాన్ని వేరుచేయటం, ఒక్క జ్ఞానిపురుషుడు మాత్రమే చెయ్యగలిగిన పని.

కానీ, ఒక్కొక్క స్పేర్ పార్ట్‌ని విడదీస్తూపోతే చివరకు I, My రెండూ విడిపోతాయి కదా! I, My రెండూ విడిపోయిన తర్వాత చివరకు మిగిలేదేమిటి My ని ఒక పక్కకు పెడితే చివరకు ఏం మిగిలింది?

**ప్రశ్నకర్త:** I.

**దాదాశ్రీ:** ఆ I యే మీరు! అంతే ఆ I నే రియలైజ్ అవాలి.

అక్కడే మా (జ్ఞాని) అవసరం పడుతుంది. నేను మీలో వాటన్నిటినీ వేరుచేస్తాను. అప్పుడు మీకు "నేను శుద్ధాత్మను" అనే అనుభవం మిగులుతుంది. అనుభవం రావటంతోపాటు మీకు దివ్యచక్షువును కూడా ఇస్తాను. అప్పుడే మీకు ఆత్మవత్ సర్వభూతేషు (అన్నిట్లో ఆత్మ స్వరూపాన్ని) చూస్తారు.

## 4. నేను ను గుర్తించటం ఎలా

## జపం, తపం, వ్రతం, నియమాలు

**ప్రశ్నకర్త:** వ్రతం, జపం, నియమాలు అవసరమేనా కాదా?

**దాదాశ్రీ:** చూడు, కెమిస్ట్ దగ్గర ఎన్ని మందులు ఉన్నాయో, అవన్నీ అవసరమైనవే. అవన్నీ మనుషులకు అవసరమైనవే. మీకు ఏ మందు ఎంత అవసరమో దాన్ని మీరు తీసుకోవాలి. అలాగే వ్రతం, తపం, నియమాలు, ఇవన్నీ అవసరమే. ప్రపంచంలో ఏదీ తప్పు కాదు. జపతపాలు తప్పు పనులు కావు. అయితే ప్రతి ఒక్కరి దృష్టి నుంచి, ప్రతి ఒక్కరు ఆశించేదాన్నిబట్టి అవి సత్యమైనవి.

**ప్రశ్నకర్త:** తపం, క్రియలతో ముక్తి లభిస్తుందా?

**దాదాశ్రీ:** తపము, క్రియలతో ఫలితాలు వస్తాయి కాని ముక్తి రాదు. వేప చెట్టుని పాతి పెంచితే చేదు పండ్లే వస్తాయి, మామిడి చెట్లు వేస్తే తియ్యటి ఫలాలు వస్తాయి. మీకు ఎలాంటి పండ్లు కావాలో అలాంటి విత్తనాలనే మీరు నాటాలి. మోక్ష ప్రాప్తికి చేసే తపస్సు భిన్నంగా ఉంటుంది, అది అంతరంగంలో

చేసే తపస్సు. బయటకు ఎంత తపస్సులో కనిపిస్తారో, కానీ వాళ్ళు అలా కాదు. వాళ్ళకి ఫలితంగా పుణ్యమైతే వస్తుంది. కానీ మోక్షానికి వెళ్ళాలంటే అంతరంగంలో  తపస్సునాచరించాలి– కఠిన తపస్సు.

**ప్రశ్నకర్త:** మంత్ర జపం వలన మోక్షం వస్తుందా లేక జ్ఞానమార్గంలోనే మోక్షం వస్తుందా?

**దాదాశ్రీ:** మంత్రజపం మీకు ప్రపంచంలో శాంతిని ప్రసాదిస్తుంది. మనస్సుకి శాంతిని కలిగించేదే మంత్రం. దానివలన భౌతికమైన సుఖాలు లభిస్తాయి. అయితే మోక్షం మాత్రం జ్ఞానమార్గంలోకి వెళ్ళకుండా లభించదు. అజ్ఞానంతో బంధనం, జ్ఞానంతో ముక్తి. జగత్తులో కలిగే జ్ఞానమంతా ఇంద్రియ జ్ఞానం. అది భ్రాంతి. అతీంద్రియ జ్ఞానమే అసలైన జ్ఞానం.

ఎవరైతే తనను తాను ఎరిగి మోక్షమార్గంలోకి వెళ్ళదలచుకున్నారో, వాళ్ళకి క్రియలతో పని లేదు. భౌతిక సుఖాలను ఆశించేవారికి మాత్రమే క్రియల అవసరం ఉంది. మోక్షానికి వెళ్ళాలంటే జ్ఞానం, జ్ఞాని ఆజ్ఞాపాలన, ఈ రెండే అతనికి అవసరం.

## "నేను" అనేది తెలుసుకునేటట్టుగా చేయగలిగేది జ్ఞాని మాత్రమే

**ప్రశ్నకర్త:** మిమ్మల్ని మీరు తెలుసుకోమని అన్నారు మీరు. అలా తెలుసుకోవటానికి ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ:** దానికి నా దగ్గరకు రా. నన్ను నేను తెలుసుకోవాలను కుంటున్నాను అని చెప్పండి. నేను మీరు తెలుసుకునేటట్టుగా చేస్తాను.

**ప్రశ్నకర్త:** నేను ఎవరో నేను తెలుసుకోవాలి అన్నది ఈ ప్రపంచంలో ఉండగా ఎలా సంభవం అవుతుంది?

**దాదాశ్రీ:** అయితే ఎక్కడ ఉండి తెలుసుకుంటారు? ప్రపంచం కాకుండే మీరు ఉండటానికి వేరే ఏమైనా జాగా ఉందా? జగత్తులో అందరూ ప్రపంచంలో ఉండేవారే, ప్రపంచంలోనే ఉంటారు. నేను ఎవరిని అన్నది తెలుసుకోవటం ఇక్కడే కుదురుతుంది. 'మీరు ఎవరు' అన్నది తెలుసుకునే విజ్ఞానమే ఉన్నది ఇక్కడ. మీరు రండి, మీరు తెలుసుకునేటట్టుగా చేస్తాను.

## మోక్షానికి సరళోపాయం

ఎవరైతే ముక్తి చెందారో, వాళ్ళ దగ్గరకు వెళ్ళి మనం, "అయ్యా, నాకు ముక్తిని కలిగించండి" అనాలి. అదే అంతిమ ఉపాయం, అన్నిటికన్నా మంచి ఉపాయం. "నేను ఎవరిని" అన్నది సరిగ్గా తెలిస్తే మోక్షమార్గం లభిస్తుంది. ఒకవేళ ఆత్మజ్ఞాని మీకు లభించకపోతే, అప్పటి వరకు ఆత్మజ్ఞాని పుస్తకాలను పఠిస్తుండాలి.

ఆత్మ అనేది సైంటిఫిక్ వస్తువు. అది పుస్తకాల నుంచి లభించే వస్తువు కాదు. అది గుణధర్మాలతో కూడివుంటుంది. చేతన. అదే పరమాత్మ. దాన్ని గుర్తిస్తే, అంతా అయినట్లే. కళ్యాణమయం. అదే మీరు.

మోక్షమార్గంలో తపస్సు, త్యాగాలు ఏమీ చెయ్యనక్కరలేదు. కేవలం ఒక జ్ఞాని పురుషుడు లభిస్తే చాలు. జ్ఞాని ఆజ్ఞాపాలనే పాటించవలసిన ధర్మం, మరియు ఆజ్ఞే తపస్సు. మరియు అదే జ్ఞానం, దర్శనం, చరిత్ర, తపస్సు. దాని ప్రత్యక్ష ఫలితం మోక్షం.

జ్ఞాని పురుషుడు లభిస్తేనే మోక్షమార్గం సులభతరం, సరళం ఔతుంది. కిచిడీ తయారు చేసేదాని కంటే సులభం.

## 5. నేను అన్నది తెలుసుకోవటం జ్ఞాని పురుషుని ద్వారా? గురువా, జ్ఞానా, ఎవరు అవసరం

**ప్రశ్నకర్త:** దాదాజీని కలవటానికి ముందు నేను ఒకరిని గురువుగా స్వీకరిస్తే అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ:** అక్కడికి వెళ్ళగూడదు అని అనుకుంటే వెళ్ళనక్కర్లేదు. మీరు వెళ్ళాలనుకుంటే వెళ్ళవచ్చు, లేదనుకుంటే లేదు. ఆయన బాధపడకూడదని అనుకుంటే కూడా తప్పక వెళ్ళాలి. మీరు వినయంగా ఉండాలి. ఇక్కడ 'ఆత్మజ్ఞానం' పొందేటప్పుడు ఎవరైనా నన్ను, 'నేను ఇప్పుడు గురువును వదిలిపెట్టాలా?' అని అడిగితే, నేనైతే 'వద్దు వదిలిపెట్టవద్దు!' అని చెప్తాను. 'అరె బాబూ, ఆ గురువు కృపతోనే ఇక్కడికి వచ్చావు నువ్వు'. ప్రపంచంలా జ్ఞానం గురువు లేకుండా అవ్వదు. అలాగే మోక్ష జ్ఞానం కూడా గురువు లేకుండా రాదు. ప్రాపంచిక 'వ్యవహారాల' గురువు ఆ వ్యవహారాల వరకే. జ్ఞాని పురుషుడు 'నిశ్చయత్వం' కోసం. వ్యవహారం రిలేటివ్, నిశ్చయత్వం రియల్. రిలేటివ్ కోసం గురువు కావాలి, నిశ్చయత్వం కోసం జ్ఞానిపురుషుడు అవసరం.

**ప్రశ్నకర్త:** గురువు లేకుండా జ్ఞానమెలా వస్తుంది అని కూడా అంటారు కదా!

**దాదాశ్రీ:** గురువు దారి చూపిస్తాడు, మార్గ దర్శనం చేస్తాడు, 'జ్ఞాని పురుషుడు' జ్ఞానాన్ని ఇస్తాడు. జ్ఞాని పురుషుడు అంటే ఎవరంటే, అది పొందిన తర్వాత తెలుసుకోవటానికి మరేమీ మిగలదు. స్వయం తత్‌స్వరూపంలో ఉంటాడు. అంటే 'జ్ఞానిపురుషుడు' మీకు అన్నీ ఇస్తాడు. గురువైతే ప్రపంచంలో మీకు మార్గాన్ని చూపిస్తాడు. ఆయన చెప్పినట్లుగా ఆచరిస్తే సంసార సుఖాలను పొందుతారు. ఆధి, వ్యాధి, ఉపాధిలలో సమాధిని ఇప్పించేవాడు 'జ్ఞాని పురుషుడు'.

**ప్రశ్నకర్త:** గురువు ద్వారానే జ్ఞానం లభిస్తుంది. కాని, ఏ గురువైతే ఆత్మసాక్షాత్కారాన్ని పొందారో, ఆయన నుంచి జ్ఞానమైతే లభిస్తుంది కదా!

**దాదాశ్రీ:** ఆయన 'జ్ఞాని పురుషుడు' అయ్యుండాలి. పైగా కేవలం ఆత్మసాక్షాత్కారాన్ని కలిగిస్తే చాలదు. ఆ 'జ్ఞాని పురుషుడు', 'ఈ జగత్తు అంతా ఏ విధంగా నడుస్తూవుంది? స్వయంగా తనెవరు? ఇదంతా ఏమిటి?' ఇటువంటి విషయాలలో స్పష్టత కలిగించగలగాలి. అప్పుడే ఆ పని పూర్తయినట్లు. లేకపోతే పుస్తకాల వెంట పరిగెడుతుంటారు. అయితే పుస్తకాలు 'హెల్పర్' లు. అవే ముఖ్యమైన వస్తువులు కావు. అవి సాధారణ కారణాలు. అసాధారణమైన కారణాలు కావు. అసాధారణమైన కారణం ఎవరు? 'జ్ఞాని పురుషుడు'.

## అర్పణ విధిని ఎవరు చేయించగలరు?

**ప్రశ్నకర్త:** జ్ఞానం తీసుకునే ముందు అర్పణ విధిని చేయిస్తారు కదా, అంతకు ముందే ఎవరైనా మరో గురువు అర్పణ విధిని చేయించివుంటే, మళ్ళీ ఇక్కడ అర్పణ విధిని చేయటం సరి కాదు కదా!

**దాదాశ్రీ:** అర్పణ విధిని గురువు చేయించనే చేయించరు. ఇక్కడ మీరు అర్పణ చేసేదేముంటుంది? ఆత్మ తప్ప మిగతావన్నీ. అంటే, అన్నీ అర్పణ చేసేవారు ఎవరూ ఉండరు కదా! అర్పణ అనేది జరగదు కూడా. ఏ గురువూ అలా కోరరు కూడా. వాళ్ళు మీకు మార్గాన్ని సూచిస్తారు. వాళ్ళు ఒక గైడ్‌గా పనిచేస్తారు. మేము గురువులం కాము. మేము జ్ఞానిపురుషులం. మేము భగవంతుని దర్శనం చేయిస్తాము. నాకు ఏ అర్పణా చేయవద్దు. ఏమైనా భగవంతునికి అర్పణ చేయండి.

## ఆత్మానుభూతి ఎలా జరుగుతుంది?

**ప్రశ్నకర్త:** 'నేను ఆత్మను' అనే జ్ఞానం ఎలా వస్తుంది? ఎవరికి వారు ఆ అనుభూతిని ఎలా పొందుతారు?

**దాదాశ్రీ:** అటువంటి అనుభూతిని కలిగించటానికే 'మేము' ఉన్నాము. ఇక్కడ మేము 'జ్ఞానం' ఇచ్చినపుడు, 'ఆత్మ', 'అనాత్మ' రెండిటినీ వేరుచేస్తాము, ఇంటికి తిరిగి పంపించేస్తాము.

జ్ఞాన ప్రాప్తి ఎవరికి వారికి జరగదు. ఎవరికి వారు చేసుకోగలిగితే, ఈ సాధు సన్యాసులంతా చేసుండేవారే. కాని ఆ పని జ్ఞాని పురుషులదే. జ్ఞాని పురుషులు ఉన్నదే అందుకు.

మందులు తీసుకోవటానికి డాక్టరు అవసరం పడుతుందా లేదా? లేకపోతే మీరే ఇంట్లో మందులను తయారుచేసుకొంటారా? ఏమైనా పొరపాటు జరిగితే ప్రాణాంతకమౌతుందనే భయం కలుగుతుంది కదా! మరి ఆత్మ విషయంలో మీరే మిక్చర్ తయారుచేసుకుంటారు. శాస్త్రాన్ని కూడా మీకున్న బుద్ధిని ఉపయోగించి, గురువు ద్వారా లభించే జ్ఞానంతో కాకుండా మీ అంతట మీరే చదువుకొని, దానితో మందులు నూరి తాగేస్తారా. దీన్నే భగవానుడు స్వచ్ఛందం అని అన్నాడు. ఇలాంటి స్వచ్ఛందం కారణంగానే ఎన్నో జన్మలు మరణించాయి. నిజానికి అది ఒక జన్మ మరణమే.

## అక్రమ జ్ఞానంతో ప్రత్యక్ష మోక్షం

'జ్ఞాని పురుషుడు' ప్రత్యక్షంగా అందుబాటులో ఉన్నారు కనుక మోక్షం కూడా లభిస్తుంది. లేకపోతే ప్రజలు ఆలోచనలో పడతారు కానీ మార్గం దొరకదు. వెనక్కి తిరిగి వెళ్ళిపోతారు. జ్ఞాని పురుషులు ఎప్పుడో ఒకటి అర ప్రకటితమౌతారు. అటువంటి వారి నుండి జ్ఞానం లభిస్తే ఆత్మానుభవం కలుగుతుంది. మోక్షమనేది ఇక్కడ ప్రత్యక్షంగా జరగాలి. దేహ సహితంగా మోక్షం లభించాలి. ఈ అక్రమ జ్ఞానంతో మోక్షం లభిస్తుంది, అనుభవం కూడా కలుగుతుంది, అలాంటిదిది.

## ఆత్మ, అనాత్మలను విడదీసేది జ్ఞాని మాత్రమే

ఈ ఉంగరంలో బంగారం, రాగి రెండూ కలిసివున్నాయి. దీన్ని మనం ఊళ్ళో ఎవరింటికైనా తీసుకెళ్ళి, ఎవరితోనైనా, “అన్నా, దీన్ని కాస్త విడదీస్తావా” అని అడిగితే దాన్ని అందరూ చేయగలుగుతారా? ఎవరా పని చేయగలరు?

**ప్రశ్నకర్త:** బంగారం పనిచేసేవాళ్ళే చెయ్యగలరు.

**దాదాశ్రీ:** ఇది ఎవరి పనో, ఎవరు ఆ పనిలో ఎక్స్‌పర్టో, అతనే బంగారం, రాగిని విడదీయగలుగుతాడు. ఎందుకంటే అతను రెండిటి గుణాలను తెలిసినవాడు- బంగారం గుణం ఇది, రాగి గుణం ఇది అని. అదే విధంగా, జ్ఞాని పురుషుడికి ఆత్మ గుణం తెలుసు, అనాత్మ గుణమూ తెలుసు.

ఉంగరంలోని బంగారం రాగి మిక్చర్ అయ్యున్నాయి కనుక వాటిని విడదీయవచ్చు. బంగారం, రాగి రెండూ కాంపౌండ్ స్వరూపంలో ఉంటే వాటిని విడదీయలేము. అలాగే, జీవిలో చేతన, అచేతన రెండిటి మిక్చర్ ఉంది. అవి కాంపౌండ్ స్వరూపంలో లేదు. అందువలన అవి తిరిగి తమ స్వభావంలోకి వెళ్ళగలుగుతాయి. కాంపౌండ్ అయినట్లయితే తెలియనే తెలియదు. చేతన గుణ ధర్మమేమిటో తెలియదు, అచేతన గుణధర్మమేమిటో కూడా తెలియదు. మరో మూడవ గుణ ధర్మం ఉత్పన్నమౌతుంది. కానీ అలా కాలేదు. అవి కేవలం మిక్చరైవున్నాయి.

## జ్ఞాని పురుషుడు ప్రపంచంలోకెల్లా గ్రేటెస్ట్ సైంటిస్ట్

ప్రపంచంలోనే గ్రేటెస్ట్ సైంటిస్ట్ అయిన ఆ ‘జ్ఞాని పురుషుడు’ మాత్రమే దాని సంగతి తెలిసినవాడు, అతనే వాటిని విడగొట్టగలుగుతాడు. అతను ఆత్మ అనాత్మలను విడదీయగలుగుతాడు. అంతేకాదు, అతను మీ పాపాలను కాల్చి

బూడిద చేస్తాడు, మీకు దివ్య చక్షువునిస్తాడు. "ఈ జగత్తు ఏమిటి, ఏ విధంగా నడుస్తూవుంది, దీన్ని ఎవరు నడుపుతున్నారు" వగైరా విషయాలను స్పష్టం చేస్తాడు. అప్పుడే ఆ పని పూర్తవుతుంది.

కోట్ల జన్మల పుణ్య ఫలం వలన 'జ్ఞాని' దర్శనమౌతుంది. లేకపోతే దర్శన భాగ్యం కూడా ఎక్కడ కలుగుతుంది? జ్ఞాన ప్రాప్తి కోసం 'జ్ఞాని' ని గుర్తించు. వేరే మరే దారీ లేదు. వెతికినవాళ్ళకి దొరికేతీరుతాడు.

## 6. జ్ఞాని పురుషుడు ఎవరు?<br>సంత్, జ్ఞాని మీద వివరణ

**ప్రశ్నకర్త:** ఎందరో సంత్‌లైనవాళ్ళున్నారు. వారికి, జ్ఞానికి తేడా ఏమిటి?

**దాదాశ్రీ:** ఎవరైతే బలహీనతలను వదిలిస్తారో, మంచి పనులను సొంతం చేసుకునేటట్టు చేస్తారో, తప్పు పనులను మాన్పించి, మంచి పనులను చేయిస్తారో, వాళ్ళే సంత్‌లు. కానీ, పాప పుణ్యాలు రెండిటి నుంచీ రక్షించేవారే జ్ఞాని పురుషులు అనిపించుకుంటారు. సంత్ పురుషులు సరైన దారిలోకి తీసుకెళ్తారు. జ్ఞాని పురుషులు ముక్తినిప్పిస్తారు. జ్ఞాని పురుషుడు అంటే చివరి స్టేషన్. ఆయన మీకు మంచి చేస్తాడు. నిజమైన జ్ఞాని ఎవరు అంటే అహంకారం, మమత రెండూ లేనివాడు.

ఎవరికైతే ఆత్మానుభవం సంపూర్ణంగా అవుతుందో, ఆయనే 'జ్ఞాన పురుషుడు' అనిపించుకుంటాడు. ఆయన బ్రహ్మాండాన్నంతటినీ వర్ణించ గలుగుతాడు. అన్నిటికీ సమాధానమివ్వగలుగుతాడు. జ్ఞాని పురుషుడు అంటే ప్రపంచంలో ఒక వింత. జ్ఞాని పురుషుడు అంటే దివ్వెకి ప్రత్యక్షరూపం.

## జ్ఞాని పురుషుని గుర్తింపు

**ప్రశ్నకర్త:** జ్ఞాని పురుషుని గుర్తించేదెలా?

**దాదాశ్రీ:** జ్ఞాని పురుషుని ఏం చెయ్యకుండానే గుర్తించగలుగుతారు. ఆయన సుగంధమే గుర్తించేటట్లుగా ఉంటుంది. ఆయన ఉండే వాతావరణమే భిన్నంగా ఉంటుంది. ఆయన వాణి వేరుగా ఉంటుంది. ఆయన మాటలతోనే అర్థమైపోతుంది. అరె, ఆయన కళ్ళల్లోకి చూస్తేనే తెలిసిపోతుంది. జ్ఞాని పురుషుని దగ్గర విశ్వసనీయత ఉంటుంది. జబర్దస్త్ విశ్వసనీయత. ఆయన పలికే ప్రతి పలుకూ శాస్త్రరూపమే అవుతుంది, ఒకవేళ అది అర్థమైతే. ఆయన వాణి, వ్యవహారం, వినయం, మనోహరం, మనసుని దోచుకునే విధంగా ఉంటాయి. ఇలాంటి లక్షణాలు ఇంకా ఎన్నో ఉంటాయి.

జ్ఞాని పురుషుడు అబుద్ధులు. ఆత్మజ్ఞానమే కలవారు పరమ సుఖాన్ని అనుభవిస్తుంటారు. వారికి దు:ఖం ఏమాత్రం ఉండదు. అందుకే అక్కడ మీ శ్రేయస్సు ఉంది. ఎవరి శ్రేయస్సు వారు చూసుకోగలిగినవారే మీకు శ్రేయస్సుని కలిగించగలుగుతారు. ఎవరైతే ఈదగలరో, వాళ్ళే మనలను తీరానికి చేర్చగలుగుతారు. అక్కడే లక్షలాది మంది ఈదుకుంటూ తీరాన్ని చేరుకుంటారు.

శ్రీమద్ రామచంద్రజీ ఇలా అంటారు, “జ్ఞాని పురుషుడు ఎవరంటే, లేశమంతైనా స్పృహ లేనివారు. ప్రపంచంలో దేన్నీ కోరుకోరు. ఉపదేశాలివ్వాలనే కోరిక కూడా ఉండదు. శిష్యులుండాలనే కాంక్ష ఉండదు. ఎవరినో బాగుచేయాలి అనే తపన కూడా ఉండదు. ఎటువంటి గర్వమూ ఉండదు. దర్పమూ ఉండదు. పోతాపణుం (నాది) అనే భావన ఉండదు.

## 7. జ్ఞాని పురుషుడు దాదాశ్రీ ఎ.ఎమ్.పటేల్

‘దాదా భగవాన్’ పదునాలుగు లోకాలకు నాథుడు. ఆయన మీలోనూ ఉన్నాడు కానీ, మీలో ప్రకటితమవలేదు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, ఇక్కడ వ్యక్తమైవున్నాడు. వ్యక్తమైనప్పుడు దాని ఫలితం లభిస్తుంది. ఒక్కసారి ఆయన పేరు తలుచుకున్నా మీ పని జరిగిపోతుంది, అలాంటిది. కానీ గుర్తుపట్టి

నామం తలుచుకుంటే మీకు శ్రేయస్సు కలుగుతుంది. ప్రాపంచిక విషయాలే మీకు అడ్డు అయితే, అవి కూడా దూరమౌతాయి.

మీకు కనిపించేది 'దాదాభగవాన్' కాదు. మీకు కనిపించే మనిషినే మీరు 'దాదా భగవాన్' అనుకుంటున్నారాఏమిటి? కాని ఇక్కడ కనిపించేవాడు భాదరణ గ్రామములో ఉండే పటేల్ అధికారి. నేను 'జ్ఞాని పురుషుడను', నాలో ప్రకటితమైవున్నవాడు 'దాదా భగవాన్'. నేను స్వయంగా భగవంతుడను కాను. నాలో ప్రకటితమైవున్న దాదా భగవాన్‌కి నేను కూడా నమస్కరిస్తాను. దాదా భగవాన్‌కి నేను భిన్నమై ఉంటాను. కానీ మనుషులు నేనే దాదా భగవాన్ అనుకుంటారు. అలా కాదు. నేను దాదా భగవాన్ ఎలా అవుతాను? ఇతను భాదరణ గ్రామంలోని పటేల్.

ఈ జ్ఞానం కలిగిన తర్వాత, దాదాజీ ఆజ్ఞలను పాలించండి కాని 'ఏ.ఎమ్.పటేల్' ఆజ్ఞలను కాదు. స్వయం పదునాలుగు భువనాలకు అధిపతియైన దాదాభగవాన్ యొక్క ఆజ్ఞలు గ్యారెంటీగా చెప్తాను. నేను మాధ్యమంగా ఈ మాటలన్నీ వస్తున్నాయి. అందువలన మీరు ఆ ఆజ్ఞలను పాలించాలి. 'నా ఆజ్ఞ' కాదు, దాదా భగవాన్ ఆజ్ఞ. నేను కూడా ఆ భగవానుని ఆజ్ఞాపాలనే చేస్తుంటాను కదా.

## 8. క్రమిక మార్గం, అక్రమ మార్గం

మోక్షానికి రెండు మార్గాలున్నాయి– ఒకటి 'క్రమిక మార్గం', రెండవది 'అక్రమ మార్గం'. క్రమిక అంటే, ఒక మెట్టు తర్వాత మరో మెట్టు ఎక్కటం. క్రమిక మార్గంలో నెమ్మది నెమ్మదిగా పరిగ్రహించటాన్ని తగ్గించుకుంటూపోతుంటే, అదే క్రమంలో మోక్షానికి తీసుకెళ్తుంది. అది కూడా ఎంతో కాలం తర్వాత. అయితే అక్రమ విజ్ఞానం అంటే ఏమిటి? మెట్టు ఎక్కవలసిన పని లేదు. లిఫ్ట్‌లో ఎక్కి కూర్చోండి, పన్నెండో అంతస్తుకి చేరుకోండి. అలా లిఫ్ట్ మార్గం

అందుబాటులో ఉంది. నేరుగా లిఫ్ట్‌లోకి వెళ్ళి కూర్చొని, భార్యా పిల్లలతో, కొడుకులు కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసేసి, అన్ని పనులూ నేరవేర్చుకొని మోక్షానికి పోవటం. ఇవన్నీ చేస్తూనేవున్నా మీ మోక్షం ఎక్కడికీ పోదు. ఇదే అక్రమ మార్గం, అపవాద మార్గం అని కూడా అంటారు. ఇది ప్రతి పది లక్షల ఏళ్ళకి ప్రకటితమౌతుంది. ఈ లిఫ్ట్‌లో కూర్చున్నవాళ్ళ కార్యం నెరవేరుతుంది. నేను నిమిత్తమాత్రుడిని. ఈ లిఫ్ట్‌లో కూర్చున్నవాళ్ళకి పని తేలికౌతుంది కదా. తేలిక ఎలాగూ చేసుకోవాలి మోక్షానికి వెళ్తున్నాం కదా. ఈ లిఫ్ట్‌లో కూర్చోవటానికి కొన్ని అర్హతలు ఉండాలా వద్దా? ఆ అర్హతలేమిటంటే, క్రోధం, అహంకారం, మోహం, లోభం ఉండకూడదు, ఆర్తధ్యానం, రౌద్రధ్యానం ఉండకూడదు. దానితో పని పూర్తవుతుంది కదా.

## ఆత్మానుభూతిని అక్రమ్ ఎంతో సరళంగా చేస్తుంది

క్రమిక్ మార్గంలో ఎంతో ప్రయత్నం తర్వాత ఆత్మ అనేది స్ఫురణకి వస్తుంది, అదీ అస్పష్టంగా. జాగృతి వైపు లక్ష్యం నిలవదు కూడా. ఆత్మ అనేది ఇలా ఉంటుంది అని లక్ష్యంలో పెట్టుకోవలసివస్తుంటుంది. కాని అక్రమ మార్గంలో నేరుగా ఆత్మానుభూతే కలుగుతుంది. తల నొప్పి వచ్చినా, ఆకలి వేసినా, పక్షవాతం వచ్చినా, బయటి నుంచి ఎన్ని కష్టాలు ఎదురైనా, లోపల కలిగే ఆనందానుభూతి వదిలిపోదు. దాన్నే ఆత్మానుభూతి అంటాము. ఆత్మానుభవం దు:ఖాన్ని కూడా సుఖంగా మార్చివేస్తుంది. మిథ్యలో ఉన్నవారికి సుఖం కూడా దు:ఖానుభవాన్నే కలిగిస్తుంది.

ఇది అక్రమ విజ్ఞానం కనుకనే ఇంత త్వరగా సమకతం జరుగుతుంది. ఇది ఎంతో ఉత్కృష్టమైన విజ్ఞానం. ఆత్మ, అనాత్మల మధ్య అంటే, మీది పరాయిదైన వస్తువులను రెండిటినీ, ఇది మీ భాగం, ఇది మీ భాగం కాదు అని తెలిసే విధంగా విడదీస్తుంది. ఇదంతా విదిన్ ఒన్ అవర్ (ఒక గంటసేపట్లోనే) లైన్ ఆఫ్ డిమార్కేషన్ (మధ్య రేఖ) ని గీస్తుంది. మీరు స్వయంగా తలబాదుకుంటూపోతే లక్ష జన్మల తర్వాత కూడా ఏమౌతుందో తెలియదు.

## 'నాకు' అదే యోగ్యత ఉంది

**ప్రశ్నకర్త:** ఈ మార్గం ఇంత సులభమైనదే అయితే, ఎవరు దానికి యోగ్యులు అన్నది చూడనే అక్కర్లేదు. ఎవరికైనా సంభవమే.

**దాదాశ్రీ:** మనుషులు నన్ను అడుగుతుంటారు, "నాకా యోగ్యత ఉందంటారా?" అని. అప్పుడు నేనంటాను, 'నాకు ఆ యోగ్యత ఉంది కాబట్టి నీకూ ఉంటుంది" అని. అలా ఉండటానికి వెనక సైంటిఫిక్ సర్కమ్‌స్టాన్షియల్ ఎవిడెన్స్ ఉంది. అందువలన మాకు ఏ వ్యక్తి తారసపడ్డా అతను యోగ్యుడనే భావిస్తాము. అది దేని మీద ఆధారపడివుంటుంది? ఆయన అందుకు యోగ్యుడు కనుకనే నన్ను కలుస్తున్నాడు. నన్ను కలిసిన తర్వాత కూడా అతని లభించకపోతే, అది అతనికి అడ్డుపడుతున్న కర్మే కారణం.

## క్రమం లో 'చెయ్యాలి' మరి అక్రమంలో....

ఒక సోదరుడు ఒకసారి, క్రమ అక్రమాలలో తేడా ఏమిటి అని ప్రశ్నించాడు. అప్పుడు నేను అతనికి ఇలా చెప్పాను, క్రమ అంటే అందరూ చెప్తుంటారే, ఈ తప్పులు వదిలేయి, ఆ మంచి పనులు చేయి అని, అదే. అందరూ అదే చెప్తుంటారు. దాని పేరే క్రమిక మార్గం. క్రమ అంటే అన్నిటినీ వదిలిపెట్టమని చెప్పేది. ఈ కపట లోభాన్ని వదిలిపెట్టు, మంచి పనులు చెయ్యి. ఇదే కదా ఇంతవరకు మీరు చూస్తూవస్తున్నది. ఈ అక్రమ అంటే, ఏదో చెయ్యక్కర్లేదు- కరోమి, కరోసి, కరోతి అనేవి లేవు.

అక్రమ విజ్ఞానం ఎంతో ఆశ్చర్యకరమైనది. ఇక్కడ 'ఆత్మజ్ఞానం' పొందిన తర్వాత రెండవ రోజు నుంచే అతనిలో పరివర్తన ప్రారంభమౌతుంది. ఈ మాట వినగానే అందరికీ ఇది నచ్చుతుంది, ఇక్కడకు లాగినట్లుగా వచ్చేస్తారు.

అక్రమ లో మౌలికంగా లోపలి నుంచే ప్రారంభమౌతుంది. క్రమిక మార్గంలో లోపలి నుంచి కూడా శుద్ధత అనేది కలుగదు. అందుకు కారణం ఆ కెపాసిటీ లేకపోవటం. అంటువంటి మెషినరీ లేదు కనుక బయటి నుంచి చేసే

పద్ధతిని అవలంబిస్తారు. మరి ఆ బయటి నుంచి చేసేది లోపలికెప్పుడు ప్రవేశించాలి? మనోవాక్కాయ కర్మలు ఏకమౌతాయే, అప్పుడు లోపల ప్రారంభమౌతుంది. అసలు (ఈ రోజుల్లో), మనోవాక్కాయ ఏకత్వమనేదే లేదు.

## కలిసిపోయివున్న ఆత్మ విడిపోవటంతోనే, అపవాద రూపంలో అక్రమ ప్రకటితమయింది

స్టెప్ బై స్టెప్ క్రమంగా ముందుకు వెళ్ళే మోక్ష మార్గాన్ని ప్రపంచం వెతికి పట్టుకుంది. అది కూడా మంచి మార్గమే. ఎప్పుడంటే, మనసులో ఉన్నదే బయటకు చెప్పటం, అదే చెయ్యటం జరిగినట్లయితే, అప్పుడు మోక్షమార్గం ముందుకు సాగుతుంటుంది. అది లేకపోతే ఆ దారి మూసుకుపోతుంది. కాని ఈ కాలంలో మనోవాక్కాయకర్మల సమన్వయం పోయింది, దానితో క్రమిక మార్గం ఫ్రాక్చరైపోయింది. అందువలన నేను చెప్పేదేమిటంటే, ఈ క్రమిక మార్గం బేస్‌మెంటు పాడైపోయింది, ఆ కారణంగానే ఈ అక్రమ మార్గం బయటకు వచ్చింది. ఇక్కడ అంతా అలౌడే. నువ్వెలా ఉంటే అలాగే సరి. నువ్వు ఇక్కడ నన్ను కలిసావు కదా చాలిక. అంటే, మనం ఇక బయటి జంఝాటంలో పడనే వద్దు.

## 'జ్ఞాని' కృపాకటాక్షంతోనే 'ప్రాప్తి'

**ప్రశ్నకర్త:** మీరు అనే అక్రమ మార్గం, మీలాంటి 'జ్ఞాని' కి సరైనది, సరళమైనది. కాని మాలాంటి సామాన్యులకు, ప్రాపంచిక విషయాలలో ఉన్నవారికి, పనిచేసుకుని బ్రతికే వాళ్ళకి చాల కష్టమైనది. మరి దానికి ఉపాయమేమైనా ఉందా?

**దాదాశ్రీ:** 'జ్ఞాని పురుషుడు' దగ్గర భగవంతుడు ప్రత్యక్షమౌతాడు. పద్నాలుగు భువనాలకు నాథుడు ప్రత్యక్షమౌతాడు. అటువంటి 'జ్ఞాని పురుషుడు' లభించినప్పుడు మీకింకేం కావాలి? మీరు మీ శక్తిని ఉపయోగించేమీ చెయ్యనక్కర్లేదు. ఆయన కృపాకటాక్షంతోనే అంతా నెరవేరుతుంది. కృపతో

అంతా మారిపోతుంది. అందువలన ఇక్కడ మీరు ఏం కోరుకుంటున్నారో అది ఇక్కడ తీరిపోతుంది. మీరు ప్రత్యేకంగా ఏమీ చెయ్యనక్కర్లేదు. మీరు 'జ్ఞాని పురుషుడు' ఆజ్ఞను పాలిస్తే చాలు. ఇది అక్రమ విజ్ఞానం. అంటే నేరుగా భగవంతుని దగ్గరి నుంచే మీ పని నెరవేర్చుకోవటం. ఆయన మీ కోసం ప్రతిక్షణం తయారుగా ఉంటారు– ఏ గంటో రెండు గంటల కోసమో కాదు.

**ప్రశ్నకర్త:** అంటే, ఆయనకు అన్నీ అర్పించుకుంటే, ఆయనే అన్నీ చూసుకుంటారా?

**దాదాశ్రీ:** ఆయనే అన్నీ చేస్తాడు. మీరు ఏమీ చెయ్యవలసిన పని ఉండదు. కర్మ ఆచరిస్తే కర్మ బంధం అంటుకుంటుంది. మీరు కేవలం లిఫ్ట్‌లో కూర్చుంటే చాలు. లిఫ్ట్‌లో కూర్చొని పంచ ఆజ్ఞల పాలన చేయాలి. లిఫ్ట్‌లో కూర్చున్న తర్వాత అందులో ఎగిరి గంతులు వేయవద్దు. చేతులు బయటకు పెట్టవద్దు. ఇంత చేస్తే చాలు. ఎప్పుడో కాని ఇలాంటి మార్గం తెరుచుకోదు. అది పుణ్యం చేసుకున్నవారికే లభిస్తుంది. దీన్ని ప్రపంచపు వింతలలో 11వది అనవచ్చు. ఎవరికైతే టికెట్టు దొరుకుతుందో వాళ్ళ పని నెరవేరినట్లే.

## అక్రమ మార్గం అందుబాటులో ఉంది

ఇందులో నా ఉద్దేశ్యం ఇంతే 'నాకు ఏ పరమ సుఖమైతే ప్రాప్తించిందో, అది మీకు కూడా ప్రాప్తించాలి'– నేను ఇందులో నాకోసం కోరుకునేది ఇంతే. అంటే ఉదయించిన ఈ విజ్ఞానం మరుగున పడగూడదు. మేము మా వెనక జ్ఞానుల పరంపరను వదిలివెళ్తాం. నా తర్వాత ఉత్తరాధికారిని వదిలివెళ్తాం. ఆ తర్వాత జ్ఞానుల లింకు కొనసాగుతుంది. అందుకోసం సజీవ మూర్తిని వెతకి పట్టుకోవాలి. వేరే మార్గం లేదు.

నేను నా చేతుల మీదుగా కొందరికి సిద్ధి కలిగేటట్టుగా చేయబోతున్నాను. ఎవరో ఒకరు నా తర్వాత ఉండాలి కదా. ఆ తర్వాతవాళ్ళకి కూడా మార్గం చూపించేవారు కావాలి కదా.

## 9. జ్ఞానవిధి అంటే ఏమిటి?

**ప్రశ్నకర్త:** మీ జ్ఞానవిధి ఎలావుంటుంది?

**దాదాశ్రీ:** జ్ఞానవిధి ఆత్మ అనాత్మ (పుద్గల్) ల సెపరేషన్ చేస్తుంది. శుద్ధ చైతన్యం, పుద్గల్ రెండిటిని విడదీయటం.

**ప్రశ్నకర్త:** సిద్ధాంతపరంగా ఇది బాగానేవుంది. కానీ దాని పద్ధతి ఏమిటన్నది నేను తెలుసుకోవాలి.

**దాదాశ్రీ:** ఇందులో ఇచ్చిపుచ్చుకునేవేమీ లేవు. ఇక్కడ కూర్చొని చెప్పిన వల్లించటమే చేయవలసింది. ('నేను ఎవరిని?' అనేదాన్ని తెలుసుకోవటానికి కేవలం రెండు గంటల జ్ఞాన ప్రయోగం జరుగుతుంది. అందులో 30 నిమిషాల సేపు ఆత్మ, అనాత్మలను వేరుచేసే భేదవిజ్ఞానపు మాటలను చెప్పించటం జరుగుతుంది. దాన్ని అందరూ సామూహికంగా అనవలసివుంటుంది. ఆ తర్వాత ఒక గంట సేపు పాంచ ఆజ్ఞల ఉదాహరణలతో సవివరంగా అవగాహన కలిగించటం జరుగుతుంది. శేష జీవితాన్ని మరి కొన్ని కర్మల బంధంలో పడకుండా గడపటం, పాత కర్మలను పోగొట్టుకోవటం, దానితోపాటు 'నేను శుద్ధాత్మను' అనే ధ్యాస ఎప్పుడూ ఉండటం అన్నవి అందులో ఉంటాయి).

## 10. జ్ఞానవిధిలో ఏం జరుగుతుంది?

మేము జ్ఞానమిస్తాము, దానితో కర్మ భస్మీభూతమౌతుంది. ఆ సమయంలో ఆవరించినవెన్నో వదిలిపోతాయి. అప్పుడు భగవంతుని కృప లభించటంతో పాటు, అతను స్వయంగా జాగృతమౌతాడు. ఒకసారి జాగృతమైన తర్వాత తిరిగి ఆ జాగృతి పోదు. అలా నిరంతర జాగృతిలో జీవించవచ్చు. అంతే నిరంతర అవగాహనలోనే ఉంటారు. ఆత్మానుభవం కలుగుతుంది అంటే, దేహ స్పృహ వీడిపోతుంది. దైహిక స్పృహ వీడిపోతుందంటే కర్మ బంధాలు ఆగిపోతాయి. ముందుగా అజ్ఞానం నుంచి ముక్తి లభిస్తుంది. తర్వాత ఒకటి రెండు జన్మలలోనే అంతిమ ముక్తి లభిస్తుంది.

## జ్ఞానాగ్నిలో కర్మ భస్మీభూతమైపోతుంది

ఈ జ్ఞానం ఇచ్చిన రోజున ఏం జరుగుతుంది? జ్ఞానాగ్ని కారణంగా అతనిలోని కర్మలు దహించబడతాయి. రెండు రకాల కర్మలు భస్మమౌతాయి, ఒక రకమైన కర్మ మిగిలిపోతుంది. ఆవిరిలాంటి కర్మ నాశనం జరుగుతుంది. నీటిలాంటి కర్మ కూడా నశిస్తుంది. కానీ మంచుగడ్డ లాంటి కర్మ నశించదు. ఎందుకంటే, అది గడ్డకట్టి ఉంది కనుక. ఫలితాన్నివ్వటానికి సిద్ధంగా ఉన్న కర్మ కూడా త్వరగా వదిలిపెట్టదు. కానీ నీరు, ఆవిరి రూపాలలో ఉన్న కర్మలు జ్ఞానాగ్నిలో దగ్ధమైపోతాయి. అందువలన జ్ఞాన ప్రాప్తి పొందగానే ఒక్కసారిగా తేలికగా అయిపోతారు, వారిలో జాగృతి వృద్ధిచెందటం ప్రారంభమౌతుంది. ఎందుకంటే, కర్మలు భస్మం కానంతవరకు మనిషిలో జాగృతి వృద్ధిచెందదు. మంచుగడ్డ లాంటి కర్మలను మనం అనుభవించక తప్పదు. వాటిని కూడా సులభంగా అనుభవించి పోగొట్టుకునేందుకు ఉన్న అన్ని మార్గాలను మేము చెప్తాము. అవి, "దాదా భగవాన్ కే అజేయ జయ జయకార హాం అనండి, త్రిమంత్రాన్ని పఠించండి, నవ కల్మలు చదవండి".

సాంసారిక దు:ఖాల స్పృహ లేకపోవటం ముక్తి మార్గంలో మొదటి అనుభవం అవుతుంది. మేము మీకు జ్ఞానాన్నిచ్చిన రెండవ రోజు నుంచే అది అనుభవంలోకి వస్తుంది. ఇక ఆ తర్వాత ఈ దేహ భారం, కర్మల భారం తగ్గిపోతాయి. అది రెండవ అనుభవం. తదుపరి కలిగే ఆనందం వర్ణనాతీతం.

**ప్రశ్నకర్త:** మీ దగ్గరి నుండి వచ్చే జ్ఞానమే ఆత్మజ్ఞానమా?

**దాదాశ్రీ:** మీకు లభించేదంతా ఆత్మజ్ఞానం కాదు. మీ లోపల ప్రకటితమయ్యేది ఆత్మజ్ఞానం. మేము మీచేత అనిపిస్తున్నది మీరు అంటూవుంటే దానితో పాపం భస్మమౌతూవుంటుంది, అంతరాళంలో జ్ఞానం ప్రకటితమౌతుంటుంది. అది మీ లోపలే జరిగింది కదా!

**ప్రశ్నకర్త:** ఔను జరిగింది.

**దాదాశ్రీ:** ఆత్మప్రాప్తి సాధారణ విషయమా? ఆ తరుణంలో (జ్ఞాన విధి సమయంలో) జ్ఞానాగ్ని చేత పాపం భస్మీపటలం అవుతుంది. ఆత్మ, దేహాలు విడిపోతాయి. ఆ తర్వాత మూడవది ఏం జరుగుతుంది? భగవానుని కృప మీమీద జాలువారుతుంది, దానివలన నిరంతరం జాగృతి ఉత్పన్నమౌతుంటుంది, ప్రజ్ఞారంభం జరుగుతుంది.

## విదియలో కాంతి నుంచి పౌర్ణమి

మేము జ్ఞానోపదేశం చేసినప్పుడు, అనాది కాలం నుంచీ, అంటే, లక్షలాది జన్మల నుంచి మీలోని అమావాస్య- అమావాస్య అంటే తెలుసా మీకు? 'నో మూన్'. అనాది కాలం నుంచి 'డార్క్‌నెస్' (అంధకారం) లో జీవిస్తూ వస్తున్నారు. వెలుగును చూడలేదు మీరు. మూన్ (చంద్రుడు) ని చూడనేలేదు. మరి మేము ఇక్కడ జ్ఞానం ఇస్తున్నప్పుడు చంద్రోదయం అవుతుంది. ముందు విదియనాటి చంద్రుని వెలుగునిస్తుంది. జ్ఞానమంతా ఇచ్చిన తర్వాత కూడా లోపల ఎంత కాంతి ఉంటుంది? విదియనాటి చంద్రుడిచ్చేంత. మరి ఈ జన్మలోనే పౌర్ణమి లభించేంత వరకూ మీరు ప్రయత్నం చేస్తూనేవుండాలి. విదియ నుండి తదియ, చతుర్థి, పంచమి, ఇలా పౌర్ణమి వరకు వచ్చినపుడు కంప్లీట్ అయినట్లు. అంటే, కేవలజ్ఞానం కలిగింది, కర్మలు అంటుకోవు, కర్మబంధాలు ఆగిపోతాయి. క్రోధం, అహంకారం, మాయా, లోభాలు పోతాయి. మీరు అంతకు ముందు మీరు చందూ భాయ్ అని భ్రాంతిలో ఉండేవారు. వాస్తవంలో "నేను చందూ భాయ్‌ని" అనేది పోయింది. ఆ భ్రాంతి వదిలిపోయింది. ఇప్పుడు మీకు ఇచ్చిన ఆజ్ఞలకు బద్ధులై ఉండండి.

ఇక్కడ జ్ఞానవిధిలోకి వచ్చినవారి పాపాలను అన్నిటినీ నేను కడిగివేస్తాను. ఆ తర్వాత మీకే ఏది తప్పు అన్నది తెలిసిపోతుంది. మీ అంతట మీకే అలా ఏది చేయగూడదు అన్నది తెలిసిపోయిన తర్వాత మీరు మోక్షానికి వెళ్ళటానికి తయారయ్యారు అని తెలుసుకోండి.

## 11. ఆత్మజ్ఞాన ప్రాప్తి తర్వాత చేసే ఆజ్ఞాపాలన మహిమ ఆజ్ఞ జ్ఞాన ప్రొటెక్షన్ కోసమే

మేము మీకు జ్ఞానం ఇచ్చిన తర్వాత మీకు ఆత్మానుభూతి కలిగిన తర్వాత ఇక మిగిలింది ఏమిటి? జ్ఞాన పురుషుని ఆజ్ఞాపాలన చేయటం. 'ఆజ్ఞ' యే మీరు పాటించవలసిన ధర్మం, 'ఆజ్ఞ' యే మీకు తపస్సు. మేమిచ్చే ఆజ్ఞలు మీకు ప్రాపంచిక వ్యవహారాలలో ఏమాత్రం ఆటంకం కలిగించదు. ప్రపంచంలో ఉన్నప్పటికీ, ప్రాపంచిక ప్రభావం మీమీద పడకుండా ఉంచేదే ఈ అక్రమ విజ్ఞానం.

ఈ కాలంలో సర్వత్రా దుస్సాంగత్యమే ఉంటోంది. వంటగది నుంచి ఆఫీసు వరకు, ఇంట్లో, బయటా, దారిలో, వాహనంలో, ట్రైన్‌లో, అలా ప్రతిచోటా దుస్సాంగత్యమే ఉంటుంది. అలా దుస్సాంగత్యం ఉండబట్టే మీకు రెండు గంటల సేపు ఇచ్చిన జ్ఞానాన్ని ఆ దుస్సాంగత్యం తినేస్తుంది. దుస్సాంగత్యం ఆ విధంగా తినేయకుండా ఉండదా? అలా జరిగేందుకు పంచ ఆజ్ఞల ప్రొటెక్షన్ అడ్డుకట్టుగా వేయటం జరిగింది. ఆ ప్రొటెక్షన్‌ని ఇస్తూవుంటే, లోపలి దశలో మార్పులు జరగవు. వాళ్ళు వాళ్ళకి అందించిన జ్ఞాన దశలోనే ఉంటారు. ఆ అడ్డుకట్ట తెగిపోతే, జ్ఞానం నశించిపోతుంది, మట్టిలో కలిసిపోతుంది.

నేను మీకీ జ్ఞానాన్నిచ్చాను, భేదజ్ఞానంతో విడదీసాను కూడా. అయితే అది మళ్ళీ విడిపోయిన దశలోనే ఉండాలి కనుక, మీకు ఆజ్ఞారూపంలో ఐదు వాక్యాలను ప్రొటెక్షన్ కోసం ఇచ్చాను. ఎందుకంటే, కలియుగం కదా, కలియుగంలో అంతా దోపిడికి గురికాకూడదు. బోధబీజాన్ని చల్లినప్పుడు దానికి నీరు కూడా పోయాలి కదా. గట్లు వేయాలా వద్దా?

### 'జ్ఞానం' తర్వాత ఎటువంటి సాధన చేయాలి?

**ప్రశ్నకర్త:** ఈ జ్ఞానం పొందిన తర్వాత ఎటువంటి సాధన చేయవలసివుంటుంది?

**దాదాశ్రీ:** సాధనలేమిటంటే, ఈ పంచాజ్ఞల పాలనైతే చేస్తున్నావు కదా! అంతే, మరే సాధనా లేదు. ఇతర సాధనాలన్నీ బంధనాలను తెచ్చిపెడతాయి. ఈ పంచాజ్ఞలు వాటిని వదిలించేవి.

**ప్రశ్నకర్త:** ఈ పంచాజ్ఞల తర్వాత కూడా ఇంకా ఏమైనా ఉందా?

**దాదాశ్రీ:** పంచాజ్ఞలనేవి మీకోసం తయారుచేసిన అడ్డుకట్టలు– మీ సొమ్మును ఎవరూ దొంగిలించకుండా మీరొక భద్రతా ఏర్పాట్లు చేసుకుంటారు కదా, సరిగ్గా అలాంటిదే మేమిచ్చింది కూడా. భద్రతాలోపాలుంటే ఎవరైనా అందులోంచి దూరి నష్టం కలిగించవచ్చు. అప్పుడు దాన్ని రిపేరు చేయటానికి మళ్ళీ నేను రావలసివుంటుంది. ఈ పంచాజ్ఞల పరిధిలో ఉన్నంత వరకు, నిరంతర సమాధికి మేము గ్యారెంటీ ఇస్తాము.

## ఆజ్ఞలతో తీవ్రమైన ప్రగతి

**ప్రశ్నకర్త:** జ్ఞాన ప్రాప్తి తర్వాత, మాలో కలిగే ప్రగతి జరిగే వేగం దేని మీద ఆధారపడివుంటుంది? ఏం చేస్తే ప్రగతి వేగం అందుకుంటుంది?

**దాదాశ్రీ:** పంచాజ్ఞల పాలనచేస్తే అంతా వేగంగా జరిగిపోతుంది. అందుకు కారణం పంచాజ్ఞలే. పంచాజ్ఞల పాలనతో ఆవరించివున్నదంతా తొలగిపోతుంటుంది. శక్తులు బైటికి వస్తాయి. అవ్యక్త రూపంలో ఉన్న శక్తులు వ్యక్తమౌతాయి. పంచాజ్ఞల పాలనతో ఐశ్వర్యం వ్యక్తమౌతుంది. వేరు వేరు రకాల శక్తులన్నీ ప్రకటితమౌతాయి. ఆజ్ఞాపాలన చేసేదాని మీదనే అంతా ఆధారపడివుంటుంది.

మేమిచ్చిన ఆజ్ఞలను సిన్సియర్‌గా ఉండటమే అన్నిటికన్నా ముఖ్యమైన గుణం. ఎవరైతే మా ఆజ్ఞాపాలన చేస్తారో వారు మాలాగే తయారౌతారు. కానీ, ఆజ్ఞాపాలన చేస్తున్నంత సేపు ఆజ్ఞలలో మార్పులు రాకూడదు. అలా చేస్తే ఎటువంటి చికాకులు ఉండవు.

## ధృఢ నిశ్చయంతోనే ఆజ్ఞాపాలన జరగాలి

దాదాశ్రీ ఆజ్ఞలను పాటించాలి. అదే అన్నిటికన్నా గొప్ప విషయం. ఆజ్ఞాపాలన చేయవలసిందే అని నిశ్చయించుకోండి. ఆజ్ఞాపాలన సంభవమా కాదా అన్నది మీరు చూడకండి. ఆజ్ఞాపాలన ఎంతవరకు చేయగలిగితే అంతే సరి. కాని, ఆజ్ఞాపాలన చేయాలని మాత్రం నిశ్చయించుకోండి.

**ప్రశ్నకర్త:** ఆజ్ఞాపాలనలో ఎక్కువ తక్కువలు జరిగినా ఏం కాదా?

**దాదాశ్రీ:** ఏం కాదు అని కాదు. ఆజ్ఞాపాలన తప్పక చెయ్యాలన్నది మీరు గట్టిగా నిశ్చయించుకోవాలి. ఉదయమే, "నేను పంచాజ్ఞలలో మెలగాలి, పాలించాలి" అని నిశ్చయించుకోవలి. అలా నిశ్చయించుకోగానే మా ఆజ్ఞలోకి వచ్చేసినట్లే. అంతే చాలు నాకు.

ఆజ్ఞాపాలన చేయటం మర్చిపోయినట్లయితే అందుకు ప్రాయశ్చిత్తంలో, "హే దాదా, రెండు గంటలసేపు నేను మర్చిపోయాను. మీ ఆజ్ఞను నేను మర్చిపోయాను కానీ, నేను మీ ఆజ్ఞాపాలన చేస్తాను. నన్ను క్షమించండి" అని చెప్పుకోవాలి. అంతే పూర్వపు పరీక్షలన్నీ పాస్. నూటికి నూరు మార్కులు వస్తాయి. అంటే నష్టమేమీ జరగలేదు. ఆజ్ఞలోకి వచ్చినట్లయితే ప్రాపంచిక విషయాలు అంటవు. మా ఆజ్ఞలను పాలిస్తే మిమ్మల్ని ఏదీ అంటదు.

## ఆజ్ఞాపాలనతోనే నిజమైన పురుషార్థం ప్రారంభం

మీకు నేను జ్ఞానాన్నివ్వగానే మీరు ప్రకృతి నుండి విడిపోయారు. "నేను శుద్ధాత్మను" అంటే పురుషుడను కనుక, దాని తర్వాతనే అసలైన పురుషార్థం, రియల్ పురుషార్థం.

**ప్రశ్నకర్త:** రియల్ పురుషార్థం, రిలేటివ్ పురుషార్థం– ఈ రెండిటి మధ్య తేడా ఏమిటి?

**దాదాశ్రీ:** రియల్ పురుషార్థంలో చెయ్యటానికంటూ ఏమీ ఉండదు. రెండిటిలో తేడా ఏమిటంటే, రియల్ పురుషార్థమంటే చూడటం, తెలుసుకోవటం. రెలిటివ్ పురుషార్థమంటే ఏమిటి? కేవలం అలా చేస్తాను అనే భావం కలిగివుండటం.

మీరు ఒకప్పుడు చందూ భాయ్, అప్పుడు మీరు అప్పుడు పురుషార్థం చేసేవారు అనేది భ్రాంతి పురుషార్థం. కాని, నేను "శుద్ధాత్మను" అన్నది ప్రాప్తించి, ఆ తర్వాత పురుషార్థం చెయ్యి, దాదా పంచాజ్ఞలలో మెలుగు, అది రియల్ పురుషార్థం. పురుష (ఆత్మ) గానే పురుషార్థం చెయ్యటం అవుతుంది.

**ప్రశ్నకర్త:** మీరు నాటిన జ్ఞాన బీజమేదైతే ఉందో, అదే ప్రకాశం, అదే జ్యోతియా?

**దాదాశ్రీ:** ఔను. కానీ విత్తనం రూపంలో. ఇక నెమ్మది నెమ్మదిగా అది వికసిస్తుంది. దేహం, పురుష రెండూ విడిపోయిన తర్వాతనే నిజమైన పురుషార్థం ప్రారంభమౌతుంది. పురుషార్థం మొదలైందంటే విదియ నుంచి పౌర్ణమిగా మారుతుంది. ఔను. ఈ ఆజ్ఞలను పాలిస్తే అలాగే జరుగుతుంది. మరింకేమీ చెయ్యనక్కర్లేదు, కేవలం ఆజ్ఞాపాలన చేస్తే చాలు.

**ప్రశ్నకర్త:** దాదా పురుష అయిన తర్వాత చేసే పురుషార్థం గురించి కాస్త వివరించండి. వ్యవహారికంగా ఇది ఎలా జరుగుతుంది?

**దాదాశ్రీ:** ఇదంతా ఉన్నదే వ్యవహారికంగాకదా. మన మహాత్ములంతా పంచాజ్ఞానలలోనే వసిస్తారు కదా. పంచాజ్ఞలే దాదా, అదే రియల్ పురుషార్థం.

పంచాజ్ఞల పాలనే పురుషార్థం. ఆ పంచాజ్ఞల పాలనా ఫలితం ఎలా ఉంటుంది అంటే, మేము చెప్పేదేమిటంటే, 'జ్ఞాతా దృష్ట' గా ఉండండి అంతే. మరి ఈ పంచాజ్ఞలు జ్ఞాతా దృష్టాగా ఉండమనే కదా బోధిస్తాయి. ఎవరైతే

హృదయపూర్వకంగా పురుషార్థం ప్రారంభించారో, వాళ్ళ మీద మా కృప తప్పకుండా వర్షిస్తుందన్నది మేము చూసాము.

## 12. 3 స్టేజ్‌లలో ఆత్మానుభవం, అనుభవం- లక్ష్యం- ప్రతీతి

**ప్రశ్నకర్త:** ఆత్మానుభవం జరిగిన తర్వాత ఏమౌతుంది?

**దాదాశ్రీ:** ఆత్మానుభవం కలిగిందీ అంటే దేహం మీద ధ్యాస తగ్గిపోయిందన్నమాట. దేహం మీద ధ్యాస తగ్గిపోయిందంటే, కర్మ బంధాలు నిలిచిపోయాయన్నమాట. మరి ఇంతకంటే ఏం కావాలి?

ఇంతకు ముందు చందూ భాయ్ ఎలా ఉండేవాడు, ఇప్పుడు చందూ భాయ్ ఎలా ఉన్నాడు అన్నది అర్థమౌతూనేవుంది. ఈ పరివర్తన ఎలా జరిగింది? ఆత్మానుభవంతో. ఇంతకు ముందు దేహం మీద ధ్యాస ఉండేది, ఇప్పుడు ఆత్మానుభవం ఉంది.

ప్రతీతి అంటే, నమ్ముతూవస్తున్న విషయమంతా నూటికి నూరు శాతం మారిపోయింది. "నేను శుద్ధాత్మను" అన్నది పూర్తిగా నిశ్చయమైపోయింది. "నేను శుద్ధాత్మను" అనేది స్థిరపడింది. కానీ తిరిగి లేచిపోవచ్చు. మరియు ప్రతీతి పోదు. శ్రద్ధ మారుతుంది. కానీ స్థిరపడ్డ ప్రతీతి మళ్ళీ పైకి లేచిపోదు.

ప్రతీతి అంటే, ఉదాహరణకు ఇక్కడ మనం కర్రని పెట్టామనుకోండి. దాని మీద చాల ఎక్కువ బరువు పెట్టినట్లయితే, అది వంకరపోతుంది కానీ అది తన స్థానంలోనే ఉంటుంది. ఎన్ని కర్మలు ఉదయించినా, చెడ్డ ఉదయం వచ్చినా, స్థానమైతే వదిలిపోదు. "నేను శుద్ధాత్మను" అనేది మాయమైపోదు.

అనుభవం, లక్ష్యం, ప్రతీతి, ఈ మూడూ ఉండిపోతాయి. ప్రతీతి శాశ్వతంగా ఉండిపోతుంది. లక్ష్యం అప్పుపడప్పుడూ ఉంటుంది. వ్యాపారంలో కాని, లేక మరేదైనా పనిలోపడి కాని, మళ్ళీ లక్ష్యం మీది నుంచి ధ్యాస

మళ్ళినట్లయితే, ఆ పని అయిపోయిన తర్వాత తిరిగి లక్ష్యంలోకి రావొచ్చు. ఆ పని పూర్తయిన తర్వాత, అన్నిటిలోంచి బయటపడిన తర్వాత ఏకాంతంలో కూర్చున్నప్పుడే అది అనుభవం రుచి తెలుస్తుంది. అయితే అనుభవమైతే వృద్ధిచెందుతూనే వుంటుంది.

అనుభవం-లక్ష్యం, ప్రతీతి! వీటిలో ప్రతీతి ముఖ్యమైనది, అదే ఆధారభూతమైనది. అది ఆధారంగా మారిన తర్వాతనే లక్ష్యం ఏర్పడుతుంది. ఆ తర్వాతనే "నేను శుద్ధాత్మను" అనేది నిరంతరం లక్ష్యంలో ఉంటుంది. విశ్రాంతిగా కూర్చున్నప్పుడు, జ్ఞాతా దృష్టా అయినప్పుడు అది అనుభవంలోకి వస్తుంది.

## 13. ప్రత్యక్ష సత్సంగ మహిమ

## సమస్యల సమాధానం కోసం సత్సంగ ఆవశ్యకత

ఈ 'అక్రమ విజ్ఞానం' ద్వారా, మీకు కూడా ఆత్మానుభవమే ప్రాప్తించింది. కానీ మీకది సులభంగా అందింది కనుక దానివలన మీకు లాభమైంది, ప్రగతిని సాధించవచ్చు. ముఖ్యంగా 'జ్ఞాని' పరిచర్యంలో ఉంటూ అర్థం చేసుకోవచ్చు.

ఈ జ్ఞానాన్ని లోతుగా తెలుసుకోవాలి. ఎందుకంటే ఈ జ్ఞానాన్ని మీకు ఒక గంట సమయంలోనే ఇవ్వటం జరిగింది. ఎంత గొప్ప జ్ఞానం! కోటి సంవత్సరాలలో జరగనిది, ఒక గంటలో జరిగింది. కాని అది బేసిక్ (మౌలికమైనది). దాన్ని విస్తారంగా తెలుసుకోవాలి కదా. దాన్ని వివరణాత్మకంగా తెలుసుకునేందుకు మీరు నా దగ్గర కూర్చొని అడిగితే నేను వివరిస్తాను. అందుకే మేము సత్సంగం అవసరమని చెప్తాను. మీరిక్కడ పెనవేసుకునివున్న ముడులను ఎంతగా అడుగుతూవుంటే, మీలోపల అవన్నీ అవన్నీ విడిపోతూవుంటాయి. మీలోపల ఏదైతే గుచ్చుకుంటూ వుందో దాన్ని అడిగేయాలి.

## విత్తనం వేసిన తర్వాత నీరు పోయటం తప్పనిసరి

**ప్రశ్నకర్త:** జ్ఞానం తీసుకున్న తర్వాత కూడా, 'నేను శుద్ధాత్మను' అనేది ధ్యాసలో పెట్టుకోవాలంటే కష్టమైన పనే.

**దాదాశ్రీ:** లేదు లేదు. మీరేమీ పెట్టుకోనక్కర్లేదు. దానంతటదే ఉంటుంది. అలా జరగాలంటే నా దగ్గరకు వచ్చిపోతుండాలి. నీళ్ళు చల్లవలసింది చల్లకపోవటం వల్లనే ఈ బాధలన్నీ. మీరు మీ వ్యాపారంలో మనసు పెట్టకపోతే ఆ వ్యాపారం ఏమౌతుంది?

**ప్రశ్నకర్త:** డౌన్ అయిపోతుంది.

**దాదాశ్రీ:** ఇది కూడా అంతే. జ్ఞానాన్ని తీసుకొచ్చిన తర్వాత దానికి నీళ్ళు పోయాలి. అప్పుడే ఆ మొక్క ఎదుగుతుంది. మొక్క చిన్నగా ఉన్నప్పుడు దానికి నీరు పోయవలసివుంటుంది. ఆ తర్వాత నెలకో రెండు నెలలకో ఒకసారి నీరు పోయాలి.

**ప్రశ్నకర్త:** ఇంట్లో చల్లుతునేవుంటాం కదా!

**దాదాశ్రీ:** లేదు. ఇంట్లో చేసేది చాలదు. అలా నడుస్తుందా? ఇక్కడ జ్ఞాని ప్రత్యక్షంగా ఉంటే, మీకు దాని విలువే తెలియటం లేదు. స్కూల్‌కి వెళ్ళారనుకుంటా. ఎన్నాళ్ళు వెళ్ళారు?

**ప్రశ్నకర్త:** పది సంవత్సరాలు

**దాదాశ్రీ:** అక్కడేం నేర్చుకున్నారు? భాష. ఈ ఇంగ్లీషు భాషని నేర్చుకునేందుకు పది సంవత్సరాలు వెచ్చించారు. కాని ఇక్కడ నేను ఆరు నెలలని చెప్తాను. ఆరు నెలలపాటు నా వెనకే తిరుగుతుంటే మీ పని పూర్తవుతుంది.

## నిశ్చయం స్ట్రాంగ్‌గా ఉంటే అవరోధాలకు బ్రేక్

**ప్రశ్నకర్త:** బయట ప్రోగ్రాంలు తయారయ్యాయి. అందువలన రావటం కష్టమౌతుంది.

**దాదాశ్రీ:** మీలోని భావం స్ట్రాంగ్‌గా ఉంటే అది విడిపోతుంది. లోపల మీ భావం స్ట్రాంగగా ఉందా లేక బలహీనంగా ఉందా అది చూసుకోండి.

## సత్సంగంతో ప్రాపంచిక విషయాలలో లాభానికి గ్యారెంటీ

ఇక్కడ నా దగ్గరకి వ్యాపారస్థులంతా వస్తుంటారు. వాళ్ళకి కూడా అంతే, ఒక గంటసేపు దుకాణానికి వెళ్ళటంలో ఆలస్యం చేస్తే, ఎన్నో వేల రూపాయల నష్టం వస్తుంది. వాళ్ళతో నేను ఇలా అన్నాను, 'ఇక్కడికి వస్తే, ఆ సమయం వలన నష్టం రాదు. కానీ, మార్గమధ్యంలో ఒక అరగంట ఏ దుకాణం దగ్గరో నిలబడితే మాత్రం మీకు నష్టం కలుగుతుంది. ఇక్కడికి వస్తే వచ్చే నష్టం నాకే. ఎందుకంటే ఇందులో నాకు వచ్చేది, పోయేది ఏమీ లేదు. అంటే, మీరు ఇక్కడికి మీ ఆత్మ కోసం వచ్చారు. అందువలన ఇక్కడ మీకు ఎటువంటి నష్టమూ జరగదు, ఇక్కడికి వస్తే.

## దాదాతో సత్సంగంలో అలౌకికత

కర్మ ఫలితం ఒకవేళ చాలా భారంగా ఉంటే, ఇది చాలా భారంగా ఉంది కనుక శాంతంగా ఉండాలి అని అర్థం చేసుకోవాలి. కర్మ ఫలం భారంగా ఉంది కనుక, దాన్ని చల్లబరచి, సత్సంగంలోనే కూర్చోవాలి. అలా జరుగుతూనేవుంటుంది. ఎలాంటి ఎలాంటి కర్మ ఫలాలు కలుగుతుంటాయన్నది చెప్పలేం.

**ప్రశ్నకర్త:** జాగృతి విశేషంగా జరగాలంటే అందుకు ఏమిటి ఉపాయం?

**దాదాశ్రీ:** ఈ సత్సంగంలో ఉండిపోవాలి. అంతే.

**ప్రశ్నకర్త:** మీతో పాటు ఆరు నెలలుంటే, దానివలన స్థూల పరివర్తన కలుగుతుంది, ఆ తర్వాత సూక్ష్మ పరివర్తన వస్తుంది అని చెప్తున్నారు.

**దాదాశ్రీ:** ఔను కేవలం దగ్గరగా ఉంటే చాలు పరివర్తన కలుగుతుంటుంది. అంటే ఇక్కడ పరిచయంలో ఉండాలి. రెండు గంటలు, మూడు గంటలు, ఐదు గంటలు. ఎంత పెట్టుబడి పెడితే అంత లాభం.

జ్ఞానం తీసుకున్న తర్వాత అందరూ అనుకునేది, “మాకిక ఏ పనీ లేదు” అని. కానీ అలా కాదు. ఎందుకంటే ఇంతవరకు పరివర్తనే జరగలేదు కదా.

## జ్ఞాని విసినిటీ (సమీపం) లో ఉండండి

**ప్రశ్నకర్త:** మహాత్ములకు సంపూర్ణమైన పదవి లభించాలంటే వాళ్ళు ఏం చెయ్యాలని అనుకోవాలి?

**దాదాశ్రీ:** ఎంత సేపు వీలైతే అంత సేపు జ్ఞానికి సమీపంలో ఉండాలి. అదే వాళ్ళకి అవసరం. మరింకేమీ లేదు. రాత్రింబవళ్ళు ఎక్కడైనా ఉండనీయండి, దాదాకి సమీపంలోనే ఉండాలి. అతని (ఆత్మజ్ఞాని) విసినిటీలో (ఆయన దృష్టి పడే విధంగా) ఉండాలి.

ఇక్కడ సత్సంగంలో కూర్చోగా కూర్చోగా కర్మ భారాలు తగ్గిపోతుంటాయి. బయటైతే కర్మ భారం పెరుగుతూపోతుంటుంది. అక్కడ సమస్యలు కూడా ఉంటాయి. ఇక్కడ ఎంతసేపు సత్సంగంలో గడిపితే, అంతసేపూ మీ వృత్తి వ్యాపారాలలో ఎటువంటి నష్టమూ రాదని నేను గ్యారెంటీ ఇస్తాను. ఇక లెక్కలు వేసుకుని చూస్తే మొత్తం మీద లాభమే కనిపిస్తుంది. ఈ సత్సంగం ఏమైనా ఏదో అల్లాటప్పా సత్సంగం కాదు. కేవలం ఆత్మ కోసమే సమయాన్ని కేటాయిస్తే ఆ మనిషికి ప్రపంచంలో నష్టమెక్కడ ఉంటుంది. లాభమే లాభం. కానీ ఈ విషయం అర్థమైతేనే కదా అలా జరిగేది. ఈ సత్సంగంలో కూర్చోవటమంటే, మీ రాక వ్యర్థంగా పోదు. ఈ కాలం ఎంత సుందరంగా ఉంది! భగవంతుని సమయంలో సత్సంగంలోకి వెళ్ళటం అంటే కాలినడకనే పోవలసివస్తుండేది. ఇప్పుడు మీరు బస్సుల్లో, ట్రైన్‌లలో కూర్చుని రాగలుగుతున్నారు.

## సర్వశ్రేష్ఠమైనది ప్రత్యక్ష సత్సంగమే

ఇక్కడ కూర్చొని ఏమీ చెయ్యకుండా ఉన్నా, మీ లోపల పరివర్తన జరుగుతూనేవుంటుంది. ఎందుకంటే ఇది సత్సంగం. సత్ అంటే ఆత్మ. ఆత్మతో

సాంగత్యం. ప్రకటితమైన ఆ ఆత్మ సాంగత్యంలో కూర్చోవాలి. సత్సంగంలో ఇది చిట్టచివరి విధానం.

సత్సంగంలో ఉంటే అంతా ఖాళీ అయిపోతుంది. ఎందుకంటే దగ్గర్లో ఉంటే, మమ్మల్ని (జ్ఞానిని) చూస్తూవుంటే, మా నుండి డైరెక్ట్‌గా శక్తులు లభిస్తాయి. అందువలన జాగృతి ఒక్కసారిగా వృద్ధిచెందుతుంది. సత్సంగంలో ఉండగలిగేటట్లుగా చూసుకోండి. ఈ సత్సంగంలో మీ పని పూర్తవుతుంది.

పని పూర్తిచేసుకోవటం అంటే ఏమిటి? ఎంత వీలయితే అంత ఎక్కువసేపు దర్శనం చేసుకోవటం. ఎంత వీలయితే అంతసేపు సత్సంగంలో ముఖాముఖిగా లాభపడటం, సత్సంగం ప్రత్యక్షంగా చేయటం. అలా చేయలేకపోతే చివరకు బాధపడవలసివుంటుంది. జ్ఞాని పురుషుని దర్శనం చేసుకోవటం, ఆయనతో కలిసి సత్సంగం చేయటం.

## 14. దాదా పుస్తకాలు, మేగజైన్‌ల మహిమ

### ఆప్తవాణి ఎంతటి ప్రయోజనకారి!

ఇది 'జ్ఞాని పురుష' వాణి. పైగా తాజాగా చెప్పినవి. ప్రస్తుత ప్రత్యామ్నాయం కనుకనే అది చదువుతూనే తనలోని ప్రత్యామ్నాయాలన్నిటిలోనూ మార్పులు వస్తాయి. అంతేకాక, అది వీతరాగి వాణి కనుక, చదువుతూవుంటే ఆనందం ఉత్పన్నమౌతూవుంటుంది. రాగద్వేష రహిత వాణి అయితే అది మేలుచేస్తుంది లేకపోతే లేదు. భగవాన్ వాణి వీతరాగ వాణి కనుక దాని ప్రభావం ఇప్పటివరకూ కొనసాగుతూవుంది. 'జ్ఞానీ పురుష' వాణి ప్రభావం కూడా ఉంటుంది. వీతరాగ వాణిని మించిన ఉపాయం మరొకటి లేదు.

### ఒకవేళ వ్యక్తిగతంగా కలవలేకపోతే

**ప్రశ్నకర్త:** దాదా, ఒకవేళ వ్యక్తిగతంగా కలవలేకపోతే పుస్తకాలు ఎంతవరకు సాయపడతాయి?

**దాదాశ్రీ:** సంపూర్ణ సహకారం లభిస్తుంది. అందులోని (పుస్తకంలోని) ప్రతి ఒక్క విషయం, ప్రతి ఒక్క పదం, ఉద్దేశ్యం దాదావి- అంటే దాని అర్థం అందులోనివన్నీ పూర్తిగా హెల్ప్ చేస్తాయి.

**ప్రశ్నకర్త:** కాని, ప్రత్యక్షంగా కలవటానికి, దీనికి తేడా ఉంటుంది కదా.

**దాదాశ్రీ:** తేడాలు చూడటం మొదలుపెడితే అన్నిటిలో తేడాలుంటాయి. అందువలన ఏ సమయంలో ఏది లభ్యమో అదే చేయాలి. 'దాదా' లేకపోతే ఏం చేస్తావు? దాదాజీ పుస్తకాలున్నాయి. వాటిని చదువు. పుస్తకంలో ఉన్నది కూడా దాదాజీయే కదా. లేకపోతే  కళ్ళు మూసుకోండి, దాదాజీ వెంటనే కనిపిస్తారు.

## 15. పంచాజ్ఞలతోనే జగత్తంతా నిర్దోషత్వం

స్వరూప జ్ఞానం లేకపోతే తన తప్పు కనపడదు. ఎందుకంటే, "నేను చందూ భాయ్‌ని, నాలో ఎటువంటి దోషం లేదు. నేను స్వయంగా అన్నీ తెలిసినవాడను" ఇలా ఉంటుంది. కాని, స్వరూపజ్ఞాన ప్రాప్తి తర్వాత మీరు నిష్పక్షపాతి అవుతారు. మనోవాక్కాయకర్మలలో పాక్షికత  ఉండదు. అందువలన మీ తప్పులు మీకే కనిపిస్తాయి.

ఎవరికైతే వాళ్ళ తప్పులు వాళ్ళకి తెలిసిపోతాయో, ఎవరికైతే ప్రతి క్షణం తన తప్పులు తెలిసిపోతూవుంటాయో, ఎక్కడెక్కడ ఉన్నాయో అక్కడక్కడ కనిపిస్తుంటే, ఆ మనిషి పరమాత్మ స్వరూపుడైనట్లే. "నేను చందూ భాయ్‌ని కాను. శుద్ధాత్మను" అన్నది అర్థమైన తర్వాత నిష్పాక్షికం అయిపోతారు. వేరేవాళ్ళలో తప్పులు ఏమాత్రం కనపడవు కాని తనలోని తప్పులన్నీ కనపడతాయి.  అప్పుడే అతని పని నెరవేరిందని చెప్పవచ్చు. తన తప్పులు తనకి కనిపించటం మొదలౌతే, అప్పటి నుంచే మేమిచ్చిన 'జ్ఞానం' పరిణామన్వితమవటం మొదలౌతుంది. తన తప్పులు తనకి తెలిసిపోవటం

మొదలైన తర్వాత ఇతరుల తప్పులు కనపడవు. ఎదుటివారి దోషాలు చూసినప్పుడు అది పెద్ద నేరం అనిపించుకుంటుంది.

ఈ నిర్దోష జగత్తులో దోషులెవరూ లేరు మరి దోషమెవరికి అంటగడతాము? దోషం ఉన్నంతవరకు అహంకారం నిర్మూలమవదు. అహంకారం నిర్మూలమయ్యేంత వరకు దోషాలను శుభ్రం చేసుకుంటూవుండాలి.

ఎవరైనా తప్పుచేసినవారిలా కనిపిస్తే, అది ఇప్పటికీ తన పొరపాటే. ఎప్పుడో ఒకప్పుడు నిర్దోషిత్వం చూడాలి కదా. మనం అనుకునేదాన్నిబట్టే ఉంటుంది అంతా. ఈ మాత్రం అర్థం చేసుకున్నా చాలవరకు పని జరిగినట్లే.

## ఆజ్ఞాపాలనతో నిర్దోష దృష్టి వృద్ధిచెందుతుంది

నాకు జగత్తులో అంతా నిర్దోషిత్వం కనపడుతుంది– ఈ దృష్టి రావాలి మీకు. అప్పుడే పజిల్ సాల్వ్ అయిపోతుంది. మీకు నేను ఎంతటి ప్రకాశాన్నిస్తానంటే, మీలోని పాపాలను ఎంతగా కడిగివేస్తానంటే, దానివలన మీకు వెలుగే ఉంటుంది, నిర్దోషిత్వమే కనపడుతూవుంటుంది. దానితోపాటు పంచ ఆజ్ఞలను కూడా ఇస్తాను. ఆ పంచాజ్ఞలకు బద్ధుడవైవుంటే, మీకిచ్చిన జ్ఞానం ఉంది కదా, అది ఏమాత్రం ఫ్రాక్చర్ కాకుండా చూస్తుంది.

## అప్పటి నుంచే సమకీతం అయినట్లు

తన తప్పు తాను తెలుసుకున్నప్పుడు ఆ మనిషి సమకీతం అయిందష అని చెప్పబడతారు. తన తప్పు తనకి కనపడితే, అప్పటి నుంచే ఆ మనిషి జాగృతమైనట్లు. లేకపోతే ఇంకా నిద్రలో నడుస్తున్నట్లే. తనలోని దోషాలు పోయాయా లేదా అన్నదాని మీద విచారించవలసిన పని లేదు. కాని, జాగృతి ముఖ్యం, అవసరం. జాగృతి తర్వాత కొత్త కొత్త దోషాలేమీ తలెత్తవు. పాతవన్నీ బయటకు వెళ్ళిపోతుంటాయి. తప్పులు ఎలా జరుగుతుంటాయన్నది గమనిస్తుండాలి.

## ఎన్ని తప్పులు చేస్తే అన్ని ప్రాయశ్చిత్తాలు

"దోషాలు అనంతంగా ఉన్నట్లయితే ప్రాయశ్చిత్తాలు కూడా అన్నే చెయ్యవలసివుంటుంది. ఎన్ని పాపాలను మూటగట్టుకుని వచ్చావో, అవే మీకు కనిపిస్తాయి. జ్ఞాని పురుషుడు జ్ఞానం ఇచ్చిన తర్వాత దోషాలు కనపడటం మొదలౌతాయి. లేకపోతే తన దోషాలు తనకి కనపడవు. దాన్నే అజ్ఞానం అంటారు. తన తప్పు ఒక్కటీ కనపడదు, ఇతరులను చూస్తే చాల ఎక్కువగా కనపడినట్లయితే, దాన్ని మిథ్యత్వం అంటారు."

## తన తప్పుల మీదనే దృష్టి...

ఈ జ్ఞానం తీసుకున్న తర్వాత లోపల తప్పు ఆలోచనలు వస్తే, వాటిని గమనించాలి, మంచి ఆలోచనలు వస్తే వాటినీ గమనించాలి. మంచివాటి మీద రాగం, చెడువాటి మీద ద్వేషం వద్దు. మంచా చెడా అన్నది చూడవలసిన పని మనకి లేదు. ఎందుకంటే అసలు నియంత్రణే మన చేతుల్లో లేదు. అంటే, జ్ఞాని ఏం చూస్తాడు? జగత్తంతా నిర్దోషంగా ఉన్నట్లు చూస్తాడు. ఎందుకంటే అవన్నీ డిశ్చార్జ్ లో ఉన్నాయి. అందులో పాపం వాళ్ళ తప్పేముంది? మిమ్మల్ని ఎవరైనా తిట్టినట్లయితే, అది డిశ్చార్జ్. బాస్ మిమ్మల్ని బాధపెడితే, అది కూడా డిశ్చార్జే. బాస్ నిమిత్తమాత్రుడు. ప్రపంచంలో ఎవరి తప్పు లేదు. తప్పు అనేది కనపడితే అది మీ పొరపాటే. అవే బ్లండర్స్. దాని మీదనే ఈ జగత్తంతా ఆధారపడివుంది. తప్పులు చూడటం, వాటిని వ్యతిరేకంగా చూడటం చేస్తేనే ద్వేషంలో బంధింపబడతారు.

## అడ్జస్ట్ ఎవిరీవేర్
## ఈ ఒక్క పదాన్ని బాగా జీర్ణించుకో

'అడ్జస్ట్ ఎవిరీవేర్' ఈ మాత్రం మీరు మీ జీవితంలో అన్వయించుకో గలిగితే చాలు. ఎంతో మేలు జరిగినట్లు. మీకు ప్రశాంతత లభిస్తుంది. ఈ కలియుగంలోని ఈ భయంకరమైన పరిస్థితులలో అడ్జస్ట్ అవకపోతే, నాశనమైపోతావు.

ప్రపంచంలో మరింకేమీ రాకపోతే పరవాలేదు కానీ అడ్జస్ట్ అవటమైతే రావాలి. ఎదుటివారు డిజెస్ట్ అవనీయండి పరవాలేదు కాని మీరు అడ్జస్ట్ అయినట్లయితే సంసారసాగరాన్ని ఈది దరికి చేరినట్లే. ఇతరులకు అనుకూలంగా ఉండటం నేర్చినవాళ్ళకి దు:ఖమే ఉండదు. 'అడ్జస్ట్ ఎవిరీవేర్!' ప్రతి వ్యక్తితోను అడ్జస్ట్ అవగలిగితే, అదే పెద్ద ధర్మం. ఈకాలంలో విభిన్న మైన మనస్తత్వాలున్నాయి కనుక, అడ్జస్ట్ అవకపోతే ఎలా నడుస్తుంది?

నాకు దూరంగా ఉండు అని ఏ ఐస్‌క్రీమ్ మీతో అనదు. మీకు తినాలని లేకపోతే తినకండి. కాని, ఈ వృద్ధులు వాటిని చూసి అయిష్టతను ప్రదర్శిస్తారు. ఇలాంటి భేదాభిప్రాయాలు కాలంలో జరిగిన మార్పులు. ఈ పిల్లలు ప్రపంచ పోకడకు అనుగుణంగా నడుస్తారు.

మేము చెప్పేదేమిటంటే, కాలంతోపాటు అడ్జస్ట్ అయిపో. పిల్లవాడు ఒక కొత్త టోపీని కొనుక్కుని వచ్చాడనుకోండి, "ఇలాంటిది ఎక్కడి నుంచి తెచ్చావు?" అని అనకండి, "ఇంత మంచిది ఎక్కడి నుంచి తెచ్చావు, ఎంతయింది, చౌకలో దొరికిందా?" అనండి. అలా అడ్జస్ట్ అవాలి.

మన ధర్మం మనకేం చెప్తుంది, అసౌకర్యంలో కూడా సౌకర్యాన్ని చూడు అని. ఈ దుప్పటి మాసిపోయింది అని రాత్రిపూట నాకు అనిపించింది. కానీ, అడ్జస్ట్ అయిపోగానే అది ఎంత మృదువుగా అనిపించిందంటే అడక్కండి మరిక. పంచేంద్రియ జ్ఞానం మనకి అసౌకర్యాలను ఎత్తిచూపుతుంది. ఆత్మజ్ఞానం సౌకర్యాన్ని చూపిస్తుంది. అందువలన ఆత్మలోనే ఉండు.

ఇది మంచి అది చెడు అనుకుంటే అది మనల్ని బాధపెడుతుంది. రెండిటినీ సమానంగా చూడాలి. దీన్ని 'మంచి' అనబట్టే అది 'చెడు' అయింది. అది మళ్ళీ బాధపెడుతుంది. నిజం చెప్పేవాళ్ళతోను, అబద్ధం చెప్పేవాళ్ళతోను అడ్జస్ట్ అయిపో. అప్పుడు, "నీకు బుద్ధి లేదు" అనేవాళ్ళతో వెంటనే అడ్జస్ట్ అయిపోయి వాళ్ళతో, "అది నాకు ముందు నుంచే లేదు. నువ్వెక్కడి నుంచి

శోధించావు? నీకు ఈ రోజు తెలిసింది కాని, నాకు అది నా చిన్నప్పటి నుంచీ తెలుసు" అని అంటే, ఝుంఝూటమే ఉండదు కదా. ఇక ఆ తర్వాత ఆ వ్యక్తి మనలో తెలివితేటలను ఎంచాలని రానే రాడు.

## భార్యతో అడ్జస్ట్‌మెంట్

ఏదో కారణం చేత ఆలస్యమై, భార్య "ఇంత ఆలస్యమైందేం? ఇలా అయితే నాకు కుదరదు" అని రకరకాలుగా అనటం మొదలుపెట్టిందనుకోండి. ఆమెకు తలతిరిగేటట్లుగా, "ఔను నీవనేది నిజమే. మరి వెనక్కి వెళ్ళిపోమంటావా? లేదు లోపలికి రమ్మంటే వచ్చి కూర్చుంటా" అనండి. అప్పుడామె, "వద్దు వెనక్కి తిరిగి పోవొద్దు. ఇక్కడ పడుకో మెదలకుండా" అన్నట్లయితే, "నువ్వు తినమంటే తింటాను లేకపోతే అలాగే పడుకుంటా" అని మీరు అంటే, ఆమె మళ్ళీ "వద్దు తిను" అన్నదనుకోండి, మాట్లాడకుండా తినేయాలి. అంటే అడ్జస్ట్ అయ్యారు. ఇక ఉదయమే మీకు ఫస్ట్‌క్లాస్ టీ ఇస్తుంది. మీరు బెదిరించినట్లయితే ముఖం మాడ్చుకుని టీ అందిస్తుంది, మూడు రోజుల వరకు అది అలాగే కొనసాగుతుంది.

## భోజనంలో అడ్జస్ట్‌మెంట్

వ్యవహారం బాగా చేస్తాడని ఎవరిని అంటారు? ఎవరైతే 'అడ్జస్ట్ ఎవిరీవేర్' ని పాటిస్తారో వారిని. ఇప్పుడు డెవలప్‌మెంటు జరుగుతున్న కాలం వచ్చింది. భేదాభిప్రాయాలకు చోటివ్వవద్దు. అందుకే నేను ఇప్పుడు అందరికీ చెప్పే సూత్రం ఇదే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'. కడీ (మజ్జిగ పులుసు) లో కారం, ఉప్పు ఎక్కువైతే, అడ్జస్ట్ అవసమని దాదాజీ చెప్పారు కదా అని గుర్తుచేసుకోండి. కడీని కొద్దిగా తినండి కూడా. పచ్చడి గుర్తుకి వస్తే, పచ్చడి తెమ్మని అడగండి. కానీ జగడాలు వద్దు. ఇంట్లో జగడాలు ఉండకూడదు. ఎక్కడైనా మీ అంతట మీరే ఇరకాటంలో పడిపోతే, మీతో మీరు కూడా అడ్జస్ట్ అయిపోండి. ప్రపంచమంతా సుందరంగా కనపడుతుంది.

## అనుగుణంగా లేకపోయినా సరే, నడవనీయండి

ఎవరైనా నీతో డిజెస్ట్ అయ్యేందుకు వచ్చారే అనుకో, వాళ్ళతో నువ్వు అడ్జస్ట్ అయిపో. రోజువారీ జీవితంలో అత్త కోడలు మధ్య లేక, ఒదినా మరదళ్ళ మధ్య, డిసెడ్జస్ట్‌మెంట్ వచ్చినప్పుడు, ఈ ప్రాపంచిక చక్రబంధం నుంచి విముక్తి చెందాలంటే, వాళ్ళకి అడ్జస్ట్ అయితీరవలసిందే. భార్యా భర్తలలో ఒకరు బంధాన్ని తెంచే ప్రయత్నం చేస్తుంటే మరొకరు దాన్ని జోడించే ప్రయత్నం చేస్తేనే ఆ సంబంధం నిలబడుతుంది, శాంతి నెలకొంటుంది. ఈ రిలేటివ్ సత్యంలో ఆగ్రహాలు, పట్టుదలల అవసరం లేదు. మానవుడు అంటే ఎవరు? ఎక్కడైనా అడ్జస్ట్ అవగలిగేవాడు.

## సరిచేస్తారా లేక అడ్జస్ట్ అవుతారా?

ప్రతి విషయంలోను మనం ఎదుటివారితో అడ్జస్ట్ అయినట్లయితే ఎంత బావుంటుంది! మనం వెంట పట్టుకునిపోయేదేముంటుంది? ఎవరైనా, “అన్నా, భార్యను తిన్నగా చెయ్యి” అని అంటే, “అరె బాబూ, ఆమెను తిన్నగా చేసి నువ్వు వంకరైపోతావు”. అందువలన భార్యను తిన్నగా చేసే ప్రయత్నం చెయ్యవద్దు. ఎలా ఉంటే అదే కరెక్ట్ అను. మీరు ఆమెతో ఎప్పటికీ ఉండబోతే అది వేరు. ఇది ఒక జన్మ బంధం. ఆ తర్వాత ఎవరెక్కడ తప్పిపోతారో. ఇద్దరి మరణ సమయాలు వేరు వేరు, ఇద్దరి కర్మలు వేరు వేరు. పరస్పరం ఇచ్చిపుచ్చుకునేదేమీ ఉండదు. ఇక్కడి నుంచి వెళ్ళిపోయిన తర్వాత ఆమె ఎక్కడికి పోతుందో ఎవరికి తెలుసు. మీరు ఆమెను సరిచేయండి, ఆమె తర్వాత జన్మలో అది కాస్తా వేరేవాళ్ళ వాటాలోకి పోతుంది.

అందువలన ఆమెను మీరు తిన్నగా చేయకండి, ఆమె మిమ్మల్ని తిన్నగా చెయ్యనక్కర్లేదు. ఎలా లభించినా బంగారమే. ఎవరి పద్ధతైనా ఎప్పటికి తిన్నగా అవదు. కుక్క తోక ఎప్పటికీ వంకరగానే ఉంటుంది. కనుక మీరు జాగ్రత్తగా అడుగు ముందుకేయండి. ఎలా ఉంటే అదే సరి. ‘ఎడ్జస్ట్ ఎవిరీవేర్’.

## తేడా వాళ్ళతో కూడా అడ్జస్ట్ అయిపో

మీ వ్యవహారం ఎలా ఉండాలంటే, అడ్జస్ట్ అయిపోవటం వలన, "ప్రతి ఇంట్లోను గొడవలు సహజమే. కానీ, ఈ ఇంట్లో మాత్రం గొడవలే ఉండవు" అనేటట్లు ఉండాలి. ఎవరితోనైతే మీకు కలవదో అక్కడ మీ శక్తులను అభివృద్ధి చేసుకోవాలి. ఎక్కడ కలుస్తుందో అక్కడ ఎలాగూ శక్తి ఉంటుంది. ప్రతికూలమని అనుకోవటం బలహీనత. నాకు అందరితోనూ అనుకూలత ఎందుకుంటుంది? అడ్జస్ట్‌మెంట్ ఎంత చేసుకుంటే అంత శక్తులు పెరుగుతాయి, అశక్తత వీడిపోతుంది. వ్యతిరేక దిశలో ఆలోచించేదానికి తాళం పడితే, సరైన అవగాహన తప్పక వస్తుంది.

మెత్తని స్వభావంకలవారితో ఎవరైనా అడ్జస్ట్ అవుతారు. కానీ, వంకర బుద్ధి, కఠినత్వం, ఆవేశపరులతో ఇలా అందరితో అడ్జస్ట్ కాగలగితే మీ పనులు సక్రమంగా నెరవేరుతాయి. మీరూ ఆవేశపడితే కుదరదు. ప్రపంచంలో ప్రతి ఒక్కటీ మనకు ఫిట్ (అనుకూలం) గా ఉండదు. మనమే దానికి ఫిట్ అవుతే ప్రపంచమంతా సుందరంగా ఉంటుంది. దాన్నే ఫిట్‌గా చేద్దామని పూనుకుంటే ప్రపంచం వంకరగానే ఉంటుంది. అందుకే, అడ్జస్ట్ ఎవిరీవేర్.

మీరు అవసరంలో ఉన్నప్పుడు ఎదుటి మనిషి ఎంత తేడాగా ఉన్నా, మంచి చేసుకునే ప్రయత్నం చేయాలి. స్టేషన్‌లో కూలి మనిషి అవసరం పడ్డప్పుడు, అతను కాస్త మొండికేస్తుంటే, అతనికో నాలుగణాలు ఎక్కువ ఇచ్చైనా అతన్ని మంచి చేసుకోవాలి. అలా చెయ్యకపోతే ఆ బ్యాగ్‌ని మనమే మోసుకోవలసివస్తుంది కదా!

## ఆరోపణా? వద్దు, 'అడ్జస్ట్' అవాలి

ఇంట్లో కూడా అడ్జస్ట్ అవటం రావాలి. మీరు సత్సంగం నుంచి ఇంటికి ఆలస్యంగా వెళ్ళారనుకోండి. ఇంట్లో ఏమంటారు? "కాస్త సమయం మీద కూడా ధ్యాస పెట్టుకోవాలా వద్దా?" అలాంటప్పుడు మనం ఇంటికి త్వరగా

వెళ్తే తప్పేమిటి? దెబ్బలు తినే సందర్భం ఎందుకు వచ్చింది? ఎందుకంటే, అంతకు ముందు ఎన్నో సార్లు ఫిర్యాదులు చెయ్యటం జరిగింది. దాని పరిణామమే ఇది. యాజమాన్యం మనది అయినప్పుడు ఫిర్యాదుల మీద ఫిర్యాదులు చెయ్యటం జరిగింది. ఇప్పుడు యాజమాన్యం లేనప్పుడు ఫిర్యాదులు చెయ్యగూడదు. అందువలన ఇప్పుడు ప్లస్-మైనస్ చెయ్యి. ఎదుటివాడు తిట్టినా, వాటిని కూడా జమచేసుకోండి. ఫిర్యాదుదారు అవనేవొద్దు.

ఇంట్లో భార్యాభర్తలిద్దరూ, "నేను అడ్జస్ట్ అవాలి" అని నిశ్చయించుకుంటే, ఇద్దరికీ తేలిగ్గా ఉంటుంది. అటువైపు ఎక్కువగా లాగుతుంటే, అప్పుడు మనం అడ్జస్ట్ అయినట్లయితే సమాధానం దొరుకుతుంది. ఒకవేళ 'అడ్జస్ట్ ఎవిరీవేర్' అవకపోతే అందరూ పిచ్చివాళ్ళయిపోతారు. ఎదుటివారికి మీరు కోపం తెప్పించారు. అందుకే పిచ్చివాళ్ళయ్యారు.

అడ్జస్ట్ అయ్యే కళ ఎవరికైతే అబ్బుతుందో, వాళ్ళు ప్రాపంచిక విషయాల నుంచి 'మోక్షం' వైపు మళ్ళినట్లే. 'అడ్జస్ట్‌మెంట్ అయింది' అంటే దాన్నే జ్ఞానం అనవచ్చు. 'అడ్జస్ట్‌మెంటు' ని నేర్చుకున్నవారు అతను గట్టెక్కినట్లే.

కొందరికి రాత్రిపూట ఆలస్యంగా పడుకునే అలవాటు ఉంటుంది, కొందరికి త్వరగా పడుకునే అలవాటు ఉంటుంది. అలాంటప్పుడు వాళ్ళిద్దరి మధ్య సమైక్యత ఎలా వస్తుంది? కుటుంబంలో అందరూ కలిసి జీవిస్తుంటే ఏం జరుగుతుంది? ఇంట్లో ఒక వ్యక్తి, "మీలో బుద్ధి తక్కువ" అనే వ్యక్తి ఉంటే, ఆ మనిషి అలాగే మాట్లాడుతాడులే అనుకోవాలి. అందువలన మీరు అడ్జస్ట్ అయిపోవాలి. దాని బదులు మీరు ఆ వ్యక్తికి జవాబివ్వటం మొదలుపెడితే మీరు అలసిపోతారు. ఎందుకంటే, ఆ మనిషి మీతో తలపడ్డాడు. ఇక మీరు కూడా అతనితో తలపడితే, మీకు కూడా కళ్ళు లేనట్లే అని నిరూపితమౌతుంది.

మనిషి స్వభావాన్ని మేము గుర్తిస్తాం. అందుకే, మీరు తలపడదలచుకున్నా, నేను తలపడనివ్వను. నేను తప్పించుకుంటాను. లేకపోతే ఇద్దరి మధ్యా యాక్సిడెంట్ అయిపోతుంది, ఇద్దరి స్పేర్ పార్ట్స్ పగిలిపోతాయి.

ఒకరి బంపర్ పగిలితే, లోపల కూర్చున్నవారి పరిస్థితి ఏమిటి? లోపల కూర్చున్నవాళ్ళది దుర్దశే కదా. అందువలన మనిషి స్వభావాన్ని గుర్తించు. ఇంట్లో సభ్యులందరి స్వభావాలనూ గుర్తించాలి.

ఈ ఘర్షణలు రోజూ జరుగుతాయా? మీ కర్మలు బహిర్గతమైనప్పుడు జరుగుతాయి. అలాంటప్పుడు మనం అడ్జస్ట్ అవాలి. ఇంట్లో భార్యతో జగడమైనట్లయితే, ఆ జగడం అయిపోయిన తర్వాత భార్యను హోటల్‌కి తీసుకెళ్ళి, భోజనం తినిపించి ఆనందపరచాలి. ఇక తంతము ఉండకూడదు.

కంచంలో ఏం పెడితే అది తినాలి. ఎదురుగా వచ్చింది ఏదైనా అది కాకతీయంగా సంయోగమే. అందువలన భగవానుడు ఇలా అన్నాడు – యాదృచ్ఛికంగా వచ్చినదాన్ని ఎగిరి తంతే ఆ దెబ్బ మీకే తగులుతుంది. అందువలన, కంచంలో మనకి రుచించని పదార్థాలున్నా, అందులోంచి కూడా రెండు మూడు తీసుకుని తినాల్సివుంటుంది.

అడ్జస్ట్ అవటం రాని మనిషిని మనం మనిషి అని ఎలా అంటాం? యాదచ్ఛికంతో అడ్జస్ట్ అయినట్లయితే, ఆ ఇంట్లో ఎటువంటి గొడవలూ ఉండవు. వాటి లాభాన్ని కోరుకుంటే అడ్జస్ట్ అయిపో. అలా చెయ్యకపోతే, ఎవరికీ లాభం కలుగదు సరికదా, వైషమ్యాలు పెరుగుతాయి కూడా.

ప్రతి వ్యక్తికీ కొన్ని ప్రిన్సిపుల్స్ (సిద్ధాంతాలు) ఉండాలి. అయినా సందర్భానుసారంగా నడుచుకుంటూవుండాలి. సందర్భానికి తగ్గట్లుగా అడ్జస్ట్ అవాలి ఆ మనిషి. ఏ సందర్భంలోనైనా అడ్జస్ట్ అవటం వచ్చినట్లయితే, దెబ్బకి మోక్షంలోకి పంపించేయవచ్చు. అంత చిత్రమైన ఆయుధం ఇది.

## డిజెస్ట్‌మెంటు, ఇదే మూర్ఖత్వం

మీరు చెప్పేది ఎదుటివారికి 'అడ్జస్ట్' అవాలి. అలా జరగకపోతే అది మన తప్పే. ఆ తప్పుని సరిచేసుకుంటే 'అడ్జస్ట్' అయిపోతుంది. వీతరాగుల చెప్పే మాట, "ఎవిరీవేర్ అడ్జస్ట్‌మెంట్". ఈ డిజెస్ట్‌మెంటే మూర్ఖత్వం. అడ్జస్ట్‌మెంటుని మేము న్యాయం అంటాము. ఆగ్రహ దురాగ్రహాలు న్యాయం అనిపించుకోవు.

ఇప్పటి వరకు ఒక మనిషి కూడా మాతో డిజెస్ట్‌మెంట్ అవలేదు. మరి వీళ్ళకి ఇంట్లో ఉండే నలుగురు మనుషులతో కూడా అడ్జస్ట్ అవదు. అలా అడ్జస్ట్ అవటం వస్తుందా రాదా? అలా జరుగుతుందా లేదా? మనం చూసింది మనకి వచ్చేస్తుంది కదా? ఈ ప్రపంచంలో నియమం ఏమిటంటే మీరు చూసిన మేరకు మీరు నేర్చుకుంటారు. అందులో ప్రత్యేకంగా నేర్పించేదేమీ ఉండదు.

ప్రపంచంలో మరేమీ రాకపోయినా ఏం కాదు. పనులు వ్యవహారాలు తక్కువగా తెలిసినా ఏం కాదు. కాని అడ్జస్ట్ అవటం రావాలి. అంటే, ఉన్న పరిస్థితులకు అడ్జస్ట్ అవటం నేర్చుకోవాలి. ఈ కాలంలో అడ్జస్ట్ అవటం రాకపోతే దెబ్బతింటారు. అందువలన, 'అడ్జస్ట్ ఎవిరీవేర్' తో మీ పనులను నెరవేర్చుకోవాలి.

## ఘర్షణని నిలువరించు<br>వివాదంలోకి (ఘర్షణలలో) రావద్దు

'ఎవరితోను ఘర్షణ పెట్టుకోవద్దు. ఘర్షణని నిలువరించు'. మా ఈ మాటలను ఆరాధించినట్లయితే, పూర్తి మోక్షానికి చేరుకుంటావు. మా ఈ ఒక్క వాక్యాన్ని పాటించిన వ్యక్తి మోక్షానికే పోవటం జరుగుతుంది.

మా ఈ ఒక్క మాటను కేవలం ఒక్క రోజన్నా పాటించి చూడు, ఆశ్చర్యకరంగా శక్తులు ఉత్పన్నమౌతాయి. మన లోపల ఎన్ని శక్తులున్నాయంటే, ఎవరైనా ఏవిధంగానైనా మనతో ఘర్షణకి వచ్చినా, దాన్ని నిలువరించ గలుగుతాము.

ఒకవేళ పొరపాటున ఎవరితోనైనా ఘర్షణ జరిగినా, దాన్ని తొలగించి పారేయి. సహజంగా ఆ ఘర్షణలో నిప్పు రవ్వలు పైకి ఎగిసిపడక ముందే, అందులో నుండి బయటపడు.

## ట్రాఫిక్ నియమాలతో ఢీకొట్టుకోవటాలును<br>నిరోధించవచ్చు

ఢీకొట్టుకున్న ప్రతిసారి, ఇరువైపులా నష్టం కలుగుతుంది. ఎదుటివారికి మీరు దు:ఖాన్ని కలుగజేస్తే, అప్పుడే, అదే క్షణంలో మీకూ దు:ఖం కలగక

మానదు. ఘర్షణ కూడా అలాంటిదే. అందుకే నేను ఈ ఉదాహరణనిచ్చాను. రోడ్డు మీద పాటించవలసిన ధర్మమేమిటి? దేనికైనా గుద్దుకుంటే మీ ప్రాణాలకే ముప్పు. గుద్దుకోవటంలో ప్రమాదం ఉంది. అందుకే ఎవరితోనూ ఘర్షణ పడవద్దు. అదేవిధంగా, వ్యవహారాలలో చేసే పనులలో కూడా ఘర్షణ వద్దు.

ఎవరైనా వ్యక్తి మీతో దెబ్బలాటకి వస్తే, అటునుంచి మాటలు బాంబుల్లాగా పేలుతూ వస్తుంటే, మీరు తెలుసుకోవలసింది ఏమిటంటే, అప్పుడు ఘర్షణను నిలువరించాలన్న విషయం. మీ మనసు మీద దాని ప్రభావం ఉండకపోవచ్చునేమో కాని, ఎప్పుడైనా ప్రభావం పడినట్లయితే, ఎదుటివారి మనసులోని ఆలోచనల ప్రభావం మన మీద పడిందని గ్రహించాలి. అప్పుడు అక్కడి నుంచి జారుకోవాలి. ఇవన్నీ ఘర్షణలు. వాటిని అర్థం చేసుకుంటూపోతుంటే, అదేవిధంగా వాటిని దాటేసుకుంటూ పోతావు. ఘర్షణను తొలగిస్తే మోక్షమే.

ఈ ప్రపంచ నిర్మాణమంతా ఒకదానికొకటి ఢీకొట్టుకోవటంతోనే జరిగింది. దాన్ని భగవంతుడు ద్వేషంతో సృష్టించాడని అంటారు. ప్రతి మనిషి, జీవరాశులన్నీ పరస్పర ద్వేషంలో ఉంటాయి. హద్దు దాటినప్పుడు విభేధించక మానరు. ఎవరైనా సరే, విభేదించటం జరుగుతుంది. ఎందుకంటే, అందరిలోను ఉన్నది ఆత్మే. ఆత్మశక్తి అందరిలోను సమానంగా ఉంటుంది. కారణం, ఈ పుద్గల్ (శరీరం) బలహీనతా భారాన్ని సహించవలసివుండటమే. సహనంతో పాటు విభేదించటం కూడా జరుగుతుంది. తర్వాత జన్మలో ఆ విభేదాన్ని తిరిగి వసూలుచేసుకుంటాడు.

ఎవరైనా మనిషి ఎక్కువగా మాట్లాడుతుంటే, ఆ వ్యక్తి మాటలు ఎలా ఉన్నా సరే ఘర్షణలోకి పోగూడదు. మన మూలంగా ఎదుటివారికి ఇబ్బంది కలిగించటమనేది చాల పెద్ద తప్పు.

## సహనమా? కాదు సొల్యూషన్ తీసుకొచ్చుకోండి

ఘర్షణను నిరోధించటమంటే సహనాన్ని చూపించటం కాదు. సహనమే చూపిస్తుంటే ఎంతవరకు చూపించగలవు? సహనం చూపించటం, 'స్ప్రింగ్' ని నొక్కటం ఒకలాంటివే. 'నొక్కి పెట్టిన స్ప్రింగ్ అలా ఎంతకాలం ఉంటుంది?' అందుకే సహించవూరుకోవటమనేది నేర్చుకోనేవద్దు. సొల్యూషన్‌ని వెతికి తెచ్చుకోవటం నేర్చుకో. అజ్ఞాన దశలో సహించివూరుకోవటమే జరుగుతుంది. ఆతర్వాత స్ప్రింగు పైకి ఎగిరి, అంతా చెల్లాచెదరు చేస్తుంది.

ఏ కారణం చేతనైనా మనకి సహించవలసివస్తే, అది మన లెక్కలోకే చేరుతుంది. అది ఏ ఖైఖాతా లోంచి వచ్చిందో, ఎవరి సరుకో మీకు తెలియదు. అందువలన, అతను కొత్త సరుకుని ఇవ్వటం మొదలుపెట్టాడని అనుకుంటాం. కొత్త సరుకుని ఎవరూ ఇవ్వరు. మనమిచ్చిందే వాపసు వస్తుంది. ఈ వచ్చింది నా కర్మానుగుణంగా వచ్చిందే కాని, ఎదుటివాడు నిమిత్తమాత్రుడు.

## ఘర్షణ పడటం మన తప్పే

ప్రపంచంలో ఏ ఘర్షణ జరిగినా, అది మీ తప్పిదమే కాని ఎదుటి మనిషిది కాదు. ఎదుటి మనిషి ఘర్షణ పడితీరతాడు. 'మీరెందుకు ఘర్షణలోకి దిగారు?' అని అంటే, 'ఎదుటి మనిషి ఘర్షణకి రావటం వలన' అంటారు. అంటే మీరూ అంధులే, ఆ మనిషిదీ అంధత్వమే.

ఘర్షణ కలిగినప్పుడు, "ఘర్షణ రావటానికి నేనేమి అన్నాను?" అని ఆలోచించినప్పుడు మీ తప్పు మీకు తెలిస్తే, సమాధానం దొరుకుతుంది. ఇక పజిల్ సాల్వ్ అయిపోతుంది. ఎంతసేపూ 'ఎదుటి మనిషి తప్పే' అనుకుంటూ వెతకటం ప్రారంభిస్తే, ఈ పజిల్ ఎన్నటికీ సాల్వ్ అవదు. 'నాదే తప్పు' అన్న భావన కలిగితేనే ఈ ప్రాపంచికం అంతం అవుతుంది. మరే ఇతర ఉపాయమూ లేదు. ఎవరితోనైనా ఘర్షణ కలిగితే అది మీ అజ్ఞానానికే సంకేతం.

ఒక పిల్లవాడు రాయి విసరగా గాయమై రక్తం కారిందనుకోండి, ఆ పిల్లవాడిని ఏం చేస్తారు. కోప్పడతారు. మీరు వెళ్తున్నప్పుడు కొండ మీది నుంచి రాయి దొర్లి పడి, అది మీకు తగిలి రక్తం కారితే అప్పుడేం చేస్తారు? కోపం తెచ్చుకుంటారా? లేదే. ఏం మరి? ఆ రాయి కొండ మీది నుంచి పడింది కనుక. రాయి విసిరిన పిల్లవాడు అక్కడ పశ్చాత్తాపపడుతుంటాడేమో, అయ్యో నేను అలా ఎందుకు చేసాను అని. మరి ఇక్కడ కొండ మీది నుంచి పడితే అది ఎవరు చేసినట్టు?

## విజ్ఞానం, అర్థం చేసుకోవలసిన విషయం

**ప్రశ్నకర్త:** మనకి ఎటువంటి క్లేశాలు వద్దు కానీ, ఎదుటివాడు జగడానికి దిగితే, అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ:** ఈ గోడతో దెబ్బలాడాలంటే ఎవరైనా ఎంతసేపు దెబ్బలాడగలుగుతారు? ఒకవేళ ఈ గోడకి మీ తల తగిలినట్లయితే, దాన్ని మీరేం చేస్తారు. తల కొట్టుకుంది. అంటే ఆ గోడతో మీకు వైరం కలిగింది. మీరు ఆ గోడను కొడతారా? అదేవిధంగా, ఎక్కువగా క్లేశాలను కలిగించేవారంతా గోడలే. ఇక మీరు ఇందులో ఎదుటివారిని చూసేదేముంటుంది? వీళ్ళు గోడల్లాంటి వారు అని మీకు మీరే అర్థం చేసుకోవాలి. అప్పుడు మీకు ఎటువంటి కష్టమూ ఉండదు.

ఈ గోడ మీద కోపం చూపించే శక్తి మీకుందా? ఎదుటివారి విషయంలో కూడా అంతే. వాళ్ళు కేవలం నిమిత్తమాత్రులుగా ఆ ఘర్షణ వచ్చింది, వాళ్ళయితే వదిలిపెట్టరు. అనవసరంగా కేకలు పెట్టుకుంటే లాభం ఏముంటుంది– అతని చేతిలో ఏమీ లేనప్పుడు? అందువలన మీరు కూడా గోడ అవండి. మీరు మీ భార్యను గద్దిస్తుంటే, ఆమెలో ఉన్న భగవంతుడు, ఇతడు నన్ను కోప్పడుతున్నాడు అని నోట్ చేసుకుంటూవుంటాడు. ఒకవేళ ఆమె మిమ్మల్ని అంటుంటే మీరు గోడలా అయిపోండి. మీలోపల ఉన్న భగవంతుడు మీకు 'హెల్ప్' చేస్తాడు.

ఎవరితోనైనా విభేదం, గోడకి కొట్టుకోవటం, రెండూ సమానమే. రెండిటిలో తేడా ఏమీ లేదు. ఎవరైనా గోడకి కొట్టుకున్నప్పుడు, ఆ వ్యక్తి చూడకపోవటం వలన కొట్టుకున్నాడు. అలాగే భేదాభిప్రాయాలు కూడా చూసుకోకపోవటం వలనే చోటుచేసుకుంటాయి. ముందు ఏమీ కనపడదు, సొల్యూషన్ కూడా కనపడదు. అందుకే భేదాభిప్రాయాలు వస్తాయి. అవన్నీ క్రోధ మోహ, మాయ, లోభాల వలన జరుగుతాయి. వాటిని చూడకపోవటం వలనే అలా జరుగుతుంది. మరి అటువంటి విషయాన్ని అర్థం చేసుకోవాలి కదా! దేనికైతే తగిలామో దాని తప్పు లేదు. గోడదేమైనా తప్పా? అలా ఈ ప్రపంచంలో అందరూ గోడల్లాంటివారే. గోడ కొట్టుకున్నప్పుడు దానితో దెబ్బలాటకు దిగరు కదా. 'నా తప్పు ఏమీ లేదు' అని దెబ్బలాట పెట్టుకోరు కదా. అలాగే అందరూ గోడ లాంటి స్థితిలో ఉన్నవారే. వారికి చెప్పి ఒప్పించవలసిన పనేమీ లేదు.

## ఘర్షణపడటం సొంత అజ్ఞానమే

ఘర్షణకు కారణమేమిటి? అజ్ఞానం. ఇతరులతో అభిప్రాయభేదం వచ్చినట్లయితే అది మీ బలహీనతకు సంకేతమే. మనుషులంతా తప్పుచేసేవారు కారు. అభిప్రాయభేదం రావటంలో తప్పు మీదే. ఇతరుల తప్పు అసలు ఉండనేవుండదు. వాళ్ళు కావాలనే చేస్తుంటే, అందుకు మనం అక్కడ క్షమాపణ కోరుకోవాలి, "అన్నా, నాకిది అర్థం కాని విషయం' అని. ఎక్కడ ఘర్షణ వచ్చినా అది మన తప్పే.

## ఘర్షణతో శక్తి హరించుకునిపోతుంది

ఆత్మ శక్తి అంతా దేనివలనైనా శూన్యమైపోతుందంటే అది కేవలం ఘర్షణ వలనే. సంఘర్షణతో ఏమాత్రం తలపడ్డా అంతా అయిపోతుంది. ఎదుటివారు ఘర్షణకి దిగితే మనం సంయమనం పాటించాలి. కేవలం ఘర్షణ లేని కారణంగానే మనిషి మోక్షాన్ని పొందుతాడు. కేవలం, "నేను ఘర్షణకు

దిగకూడదు' అన్నది నేర్చుకుంటే చాలు, ఆ మనిషికి ఇక ఏ గురువూ, లేక మరెవరి అవసరమూ ఉండదు. ఒకటి రెండు జన్మలలోనే నేరుగా మోక్షంలోకి వెళ్ళిపోతాడు. 'అసలు ఘర్షణలోకే పోగూడదు' అన్నది శ్రద్ధగా ఆచరిస్తే, ఆ మనిషి సమకీతం సాధించినట్లే. మూడు జన్మలలో మోక్షాన్ని పొందుతాడు.

ఇంతకు ముందు జరిగిన ఘర్షణ వలన జరిగిన నష్టమే తిరిగి వస్తుంది. కాని, మళ్ళీ కొత్త ఘర్షణను ప్రారంభిస్తే, శక్తులన్నీ పోతాయి. వచ్చిన శక్తి కూడా పోతుంది. ఒకవేళ తానుగా ఘర్షణను నిరోధించినట్లయితే, శక్తి ఉత్పన్నమౌతుంది.

ఈ ప్రపంచంలో ద్వేషం వలనే ఘర్షణలు తలెత్తుతాయి. ప్రపంచానికి ద్వేషమే మూల బీజం. ఎవరికైతే ద్వేషం, ఘర్షణ పడటం, ఈ రెండూ ఆగిపోతుందో, వాళ్ళు మోక్ష ప్రాప్తి జరిగినట్లే. ప్రేమ బాధ కలిగించేది కాదు. ద్వేషం పోతే ప్రేమ ఉత్పన్నమౌతుంది.

## కామన్‌సెన్స్, ఎవిరీవేర్ అప్లికబుల్

మనతో ఎవరైనా ఘర్షణ పడతారేమో కాని, మనం మాత్రం ఎవరితోనూ ఘర్షణ పడం. అలా నడుచుకున్నట్లయితే కామన్ సెన్స్ ఉత్పన్నమౌతుంది. కానీ మనం ఎవరితోనూ పడగూడదు లేకపోతే కామన్‌సెన్స్ వెళ్ళిపోతుంది. మనవైపు నుంచి ఘర్షణకి తావివ్వగూడదు. ఎదుటివారి ఘర్షణ వలన మనలో కామన్‌సెన్స్ ఉత్పన్నమౌతుంది. ఆత్మశక్తి ఎలాంటిదంటే, ఘర్షణ జరిగే సమయంలో ఎలా నడుచుకోవాలి, ఆ ఉపాయాలన్నీ మనకి చెప్తుంది. ఒకసారి అలా చెప్పిన తర్వాత, ఆ జ్ఞానం ఇక ఎప్పటికీ పోదు. అలా చేయగా చేయగా కామన్‌సెన్స్ పెరుగుతూపోతుంటుంది.

ఈ గోడ విషయంలో ఏదైనా పిచ్చి ఆలోచన వచ్చినా పరవాలేదు. ఎందుకంటే ఆ నష్టం ఏకపక్షీయమౌతుంది. కానీ సజీవంగా ఉన్న వ్యక్తి విషయంలో ఏమైనా వ్యతిరేక భావన ఒక్కటి వచ్చినా, అది ప్రమాదానికి

దారితీస్తుంది. ఇరువైపులా నష్టం జరుగుతుంది. కాని మనం దానికి ప్రతిక్రమణ చేస్తే ఆ తప్పు మొత్తం పోతుంది. అందుకే ఘర్షణ ఎక్కడైతే ఉంటుందో, అక్కడ ప్రతిక్రమణ చేయాలి. అప్పుడు ఘర్షణ లేకుండా పోతుంది.

ఎవరికైతే జీవితంలో ఘర్షణ ఉండదో, ఆ వ్యక్తికి మూడు జన్మల వరకు మోక్షం కొనసాగుతుంది. దానికి నేను గ్యారెంటీ ఇస్తాను. ఘర్షణ జరిగితే ప్రతిక్రమణ చేయండి. ఘర్షణలు వస్తూనేవుంటాయి. ఈ వికారాలు, సంబంధాలు ఉన్నంతవరకూ ఘర్షణలు ఉంటాయి. ఘర్షణకి మూలమే అవి. విషయాన్ని జయించినవారిని ఎవరూ ఓడించలేరు. ఎవరూ అతని పేరును కూడా ఎత్తలేరు. ఆ ప్రభావం పడుతుంది.

## జరిగింది ఏదైనా న్యాయమే

## ప్రకృతి ఎప్పుడూ న్యాయబద్ధంగానే నడుస్తుంది.

ప్రకృతి న్యాయంలో ఒక్క క్షణమైనా అన్యాయం చోటుచేసుకోదు. ఈ ప్రకృతి క్షణమాత్రం కూడా అన్యాయానికి పూనుకోలేదు. న్యాయస్థానాలలో అన్యాయం జరగవచ్చేమో కాని, ప్రకృతి ఎప్పుడూ అన్యాయానికి పాల్పడదు.

ప్రకృతిలో జరిగే న్యాయాన్ని అర్థం చేసుకుని, "జరిగింది ఏదైనా న్యాయమే" అని అనుకుంటే, మీరు ఈ జగత్తు నుండి విముక్తులౌతారు. ప్రకృతి చేసేది అన్యాయమనే భావన ఏమాత్రం వచ్చినా, మీకు అది ఈ జగత్తులో బాధలు కలిగించేదౌతుంది. ప్రకృతి న్యాయం చేస్తుంది అని నమ్మటమే జ్ఞానానికి మారుపేరు. 'ఎలా జరిగితే అదే సరి' అని తెలుసుకోవటమే జ్ఞానం. 'ఎలా జరిగితే అదే సరి' అని తెలుసుకోకపోవటమే అజ్ఞానం.

జగత్తులో న్యాయాన్ని వెతికే పనిలోనే ప్రపంచం మొత్తం లోనూ యుద్ధాలు జరిగాయి. జగత్తు న్యాయ స్వరూపం. అందువలన ఈ జగత్తులో న్యాయమెక్కడ ఉందని వెతకవద్దు. ఏం జరిగితే అదే న్యాయం. ఈ కోర్టులు మొదలైనవి ఎందుకు తయారయ్యాయి, న్యాయాన్ని వెతకుతారు అందుకే. అరె

బాబూ, న్యాయం అనేది ఉండవచ్చు. దాని బదులు 'ఏం జరిగింది' అన్నది చూడు. అదే న్యాయం. న్యాయాన్యాయాల ఫలితం ఒక లెక్క ప్రకారమే వస్తుంది. మనమేమో దానితో న్యాయాన్ని జాయింట్ చేసే ప్రయత్నం చేస్తాం. అలాంటప్పుడు కోర్టుకేగా పోవలసింది.

మీరు ఎవరినైనా ఒక తిట్టు తిడితే, ఆ వ్యక్తి మిమ్మల్ని రెండు మూడు తిట్లు తిడతాడు. ఎందుకంటే, అతని మనసులో మీమీద మరిగిపోతూవుంటుంది. అప్పుడు అందరూ ఏమంటారు? నువ్వెందుకు మూడు తిట్లు తిట్టావు, ఇతను ఒకటేగా తిట్టాడు అని. ఇదా న్యాయం? అతని లెక్కలో మనకి మూడు తిట్లు ఇవ్వాలనే రాసివుంది. పూర్వజన్మలోని బాకీ తీర్చాలా వద్దా? ప్రకృతిలో న్యాయం ఏమిటి? పాత లెక్కలన్నిటినీ ఒక దగ్గరకు చేర్చుతుంది. ఒక స్త్రీ తన భర్తను బాధ పెడుతున్నట్లయితే, అది ప్రకృతిలోని న్యాయం. ఆమె భర్త తన భార్య చాల చెడ్డది అనుకుంటాడు. భార్య ఏమనుకుంటుంది, భర్త చెడ్డవాడని. కాని అది ప్రకృతిలోని న్యాయమే.

ఈ జన్మలో చెమటోడ్చి సంపాదించింది ఉండవచ్చు కానీ, అంతకు ముందు లెక్క కూడా ఉంది కదా. బైఖాతాలో బాకీ ఉంది. లేకపోతే మనది ఎవరూ ఏమీ తీసుకోరు. ఎవరి నుంచైనా తీసుకున శక్తి లేదు. తీసుకోవటమనేది మన వెనక, ముందు లెక్కల ఫలితం. ఈ ప్రపంచంలో, ఎవరినైనా ఏమైనా చేయగలవారు ఇంతవరకు పుట్టనేలేదు. జగత్తు అంటే అంత నియమబద్ధమైనది.

## పరిణామం కంటే కారణమేమిటన్నది తెలుసుకో

ఇదంతా రిజల్ట్. పరీక్షల రిజల్ట్ వస్తుందే అలాగే గణితంలో నూటికి తొంభై ఆరు మార్కులు, ఇంగ్లీషులో వందకి ఇరవై ఐదు మార్కులు వచ్చాయి అన్నట్లు. అప్పుడు మనకి ఎక్కడ తప్పులు చేసామన్నది తెలియదా? ఆ ఫలితం ద్వారా ఏయే కారణాల వలన తప్పులు జరిగాయన్నది మనకి తెలిసిపోతుంది కదా! ఈ యాదృచ్ఛికంగా జరిగేవన్నీ ఒక దగ్గరికి వచ్చాయి కదా, అవే

పరిణామాలు. ఇప్పుడు ఆ పరిణామాల కంటే, కాజ్ ఏమిటి అన్నది మనకి అర్థమౌతుంది.

అందరూ నడిచే దారిలో తుమ్మ ముల్లు పైకి లేచి వుంటుంది. చాల మంది అక్కడి నుండి నడిచి వెళ్ళారు కానీ ఆ ముల్లు అలాగే ఉంది. బూట్లు కాని చెప్పులు కాని లేకుండా మీరు ఎప్పుడూ ఇంట్లోంచి బయటకు వెళ్ళరు కానీ, మీరు ఆరోజు ఎవరి ఇంటికో వెళ్ళారు, అక్కడ దొంగలు పడ్డారు దొంగలు పడ్డారు అనే అరుపులు వినిపించాయి, మీరు ఒట్టి కాళ్ళతో బయటకు పరిగెత్తగా, మీ కాళ్ళకు ముల్లు గుచ్చుకుందనుకోండి. అది మీ ఖాతాలో ఉన్నదే.

ఎవరైనా మీకు దు:ఖాన్ని కలిగిస్తే దాన్ని మీరు జమ వేసుకోండి. మీరు అంతకు ముందు ఇచ్చివుంటారు అది మీకు వాపస్ జమ అయింది. ఎందుకంటే, ఇక్కడ కారణం లేకుండా ఎవరూ ఎవరికీ దు:ఖాన్ని కలిగించలేరు. అటువంటి చట్టమే లేదు. దాని వెనక కాజ్ ఉండాలి. అందుకే దాన్ని జమ వేసుకో.

## భగవానుని దగ్గర ఎలా ఉంటుంది?

భగవంతుడు న్యాయం చేసేవాడు కాడు, అన్యాయం చేసేవాడూ కాడు. ఎవరికీ దుఖం కలుగగూడదు అనేదే భగవంతుని భాష. న్యాయాన్యాయాలు లోకంలోని భాష.

దొంగ, దొంగతనం తన ధర్మమనుకుంటాడు. దాత, దానం చేయటమే తన ధర్మమని నమ్ముతాడు. ఇదే లోకం భాష. భగవంతుని భాష కాదు. భగవంతుని దగ్గర అలాంటిదేమీ లేదు. భగవంతుని దగ్గర ఉండేది ఇదే, 'ఏ జీవికీ కష్టం కలుగకూడదు, ఇదే మా ఆజ్ఞ'.

## తన తప్పు అన్యాయంలా కనిపిస్తుంది

కేవలం తన దోషం వలనే ప్రపంచమంతా నియమానుసారం నడవటం లేదు అనిపిస్తుంది. ఒక క్షణంసేపు కూడా నియమం తప్పి లేదు. పూర్తిగా

న్యాయమే నడుస్తుంది. ఇక్కడ కోర్ట్‌లలో న్యాయంలో తేడా ఉండవచ్చు, తప్పు ఉండవచ్చు. కానీ, ప్రకృతి న్యాయంలో తేడా ఉండదు.

ఒక సెకండు కాలం కూడా న్యాయం తప్పి ఉండదు. అన్యాయం చేసేదే అయితే ఎవరూ మోక్షాన్నే కోరుకోరు. మంచివాళ్ళకే ఎందుకు కష్టాలు వస్తాయి అని అనుకుంటూవుంటారు. కానీ, ఎవరూ ఒట్టిగానే కష్టాలు కలిగించలేరు. ఎందులోనైనా తనకు తానుగా కలుగజేసుకోకపోతే, మీ పేరు చెప్పే శక్తి ఎవరికీ లేదు. మీరే మధ్యలో కలుగజేసుకున్నారు. అందుకే అంతా అలా జరిగిపోయింది.

## జగత్తు న్యాయస్వరూపం

ఈ జగత్తు అర్థంలేనిది కాదు. జగత్తు న్యాయ స్వరూపం. ప్రకృతి ఎవరికీ అన్యాయం చెయ్యలేదు. ప్రకృతి ఒక చోట ఏ మనిషినైనా చంపేస్తుంది, యాక్సిడెంట్ అయిపోతుంది, అదంతా న్యాయస్వరూపమే. ప్రకృతి ఎప్పుడూ న్యాయాన్ని దాటి పోలేదు. పనిలేక, తెలియనితనంతో ఏదో ఒకటి అంటూవుంటారు. వాళ్ళకి జీవించే కళ కూడా తెలియదు. ఎప్పుడు చూసినా చింతే చింత. అందువలన ఏం జరిగితే అదే న్యాయమని అనుకో.

జరిగిందే న్యాయం అని అనుకుంటే ప్రపంచాన్నంతా దాటినట్లే. ప్రపంచంలో ఒక సెకండు కాలంలో కూడా అన్యాయమనేది జరగనే జరగదు. న్యాయమే జరుగుతుంది. కాని, బుద్ధి మనల్ని, 'దీన్ని న్యాయమని ఎలా అనగలం' అనిపించేటట్లు చేస్తుంది. అందుకే మౌలికమైన విషయాన్ని మీకు చెప్తాను. ఇదంతా ప్రకృతిదే. బుద్ధి నుండి మీరు వేరవండి. బుద్ధి ఇందులో ఇరికిస్తుంది. ఒకసారి అంతా అర్థమైన తర్వాత బుద్ధి చెప్పే మాటలను ఒప్పుకోకండి. జరిగిందే న్యాయం. కోర్టు ఇచ్చిన తీర్పులలో అటు ఇటు కావొచ్చు కాని ఈ న్యాయంలో తేడాలుండవు.

న్యాయం కోసం అన్వేషించే పనిలో ఆయాసం వచ్చింది. మనిషి మనసులో, నేను దీనికి ఏం నష్టం చేసానని నా పనిని భ్రష్టుపట్టిస్తుంది అనిపించవచ్చు. ఏది న్యాయమని వెతికే పనిలో ఎంతో దెబ్బతిన్నారు. అందుకే న్యాయాన్ని వెతక్కండి. న్యాయాన్ని వెతికినవాళ్ళందరికీ (దెబ్బలు తిని, తిని) వాతలు పడ్డాయి. అయినా చివరకు మళ్ళీ అక్కడికే వచ్చింది. మరి అలాంటప్పుడు ముందునుంచే ఎందుకు అర్థం చేసుకోరు? ఇది కేవలం అహంకారానికి నిరూపణ.

## వికల్పాలు అంతమవటమే మోక్ష మార్గం

బుద్ధి వికల్పాలను కలిగించినప్పుడు, ఏం జరిగితే అదే న్యాయం అని అనుకోండి. నాకంటే చిన్నది, మర్యాద తప్పి ప్రవర్తిస్తోంది అని బుద్ధి న్యాయాన్ని వెతుకుతూవుంటుంది. అది మర్యాదగా ప్రవర్తించినా అదే న్యాయం, మర్యాద తప్పినా అదీ న్యాయమే. బుద్ధి ఎంత నిర్వివాదంగా ఉంటే, మనం అంత నిర్వికల్పంగా ఉంటాం మరి.

న్యాయం కోసం వెతుకులాడుతుంటే, వికల్పాలు పెరుగుతుంటాయి. ఆ ప్రకృతి ధర్మం వికల్పాలను నిర్వికల్పం చేస్తుంటుంది. ఏది జరిగితే అదే న్యాయం. చివరకు, ఐదుగురితో కూడిన పంచాయతీ ఇచ్చిన తీర్పు ఈయనకి విరుద్ధంగా ఉంటే, అప్పుడు ఆ న్యాయాన్ని కూడా ఒప్పుకోడు, ఎవరేం చెప్పినా ఒప్పుకోడు. ఇక వికల్పాలు పెరుగుతూనేపోతుంటాయి. తన వలని తనే అల్లుకుంటున్న మనిషి, చివరికి ఏమీ పొందడు. దు:ఖితుడౌతాడు. దానికంటే ముందే, ఏది జరిగితే అదే న్యాయం అని విశ్వసించాలి.

ప్రకృతి ఎప్పుడూ న్యాయమే చేస్తుంది. నిరంతరం న్యాయమే చేస్తుంది. కాకపోతే అందుకు ప్రమాణాలను చూపించలేకపోతుంది. ఆ ప్రమాణాలను 'జ్ఞాని' చెప్పగలుగుతాడు, అది ఏవిధంగా న్యాయం అని. ఎలా జరిగిందది అన్నది 'జ్ఞాని' చెప్తాడు. వాళ్ళని తృప్తిపరుస్తాడు. అప్పుడు నిబేద వస్తుంది. నిర్వికల్పమైనప్పుడు నిబేద వస్తుంది.

# తన తప్పుకి శిక్ష అనుభవించటం ప్రకృతి న్యాయాలయంలో...

ఈ ప్రపంచంలో న్యాయాధీశులు అన్ని చోట్లా ఉంటారు. కానీ కర్మ జగత్తులో న్యాయాధీశుడు ఒక్కడే– "తన తప్పుకి శిక్షను అనుభవించటం". ఈ ఒక్క న్యాయంతోనే లోకమంతా నడుస్తూవుంది, ప్రపంచమంతా భ్రాంతి మీద ఆధారపడివుంది.

క్షణకాలం కూడా ప్రకృతి న్యాయం నుండి వెలుపలకు పోదు. ఎవరికి బహుమతిని అందించాలో వాళ్ళకి బహుమానాన్ని, ఎవరిని దండించాలో వాళ్ళకు దండననిస్తుంది. ప్రకృతి న్యాయం నుండి బయటకు పోదు. నియమానుసారమే నడుస్తుంటుంది. సంపూర్ణంగా న్యాయపూర్వకం. కానీ ఎదుటివాళ్ళ దృష్టిలో అది పడకపోయేటప్పటికి అర్థం చేసుకోలేకపోతారు. దృష్టి నిర్మలమైనట్లేతేనే న్యాయం అనేది కనపడుతుంది. స్వార్థ దృష్టి ఉన్నంతకాలం, న్యాయం ఎలా కనపడుతుంది?

## మీరెందుకు అనుభవించాలి?

మనం దు:ఖాన్ని ఎందుకు అనుభవించాల్సివచ్చింది? ఇది శోధించి తెలుసుకో. మనం మన తప్పులకే బంధితులమయ్యాం. ఎవరో వచ్చి మనల్ని బంధించలేదు. ఈ తప్పులు ఆగిపోతేనే ముక్తి. నిజానికి ముక్తితోనే ఉన్నాం కానీ మనం చేసిన తప్పిదాల కారణంగా బంధాలను అనుభవిస్తున్నాం.

జగత్తు గురించిన వాస్తవికత రహస్య జ్ఞానం, మనుషుల లక్ష్యంగా లేదు. దానివలనే దారి తెలియక తిరగవలసివస్తోంది. అజ్ఞాన–జ్ఞానం గురించి అందరికీ తెలుసు. జేబు కత్తిరించారు. ఎవరిది అందులో తప్పు? మరొకరి జేబు కత్తిరించబడలేదు, మీదే ఎందుకు కత్తిరించబడిందియ మీ ఇద్దరిలో ఎవరు దాన్ని అనుభవిస్తున్నారు? ఎవరి తప్పుకి వాళ్ళు అనుభవిస్తారు.

## తన తప్పుల కారణంగానే అనుభవిస్తారు

దుఖాన్ని అనుభవించేవారిది వాళ్ళ తప్పులనే, సుఖాన్ని భోగించేవారు వారి బహుమానాలనే. కానీ భ్రాంతిలోని న్యాయం, నిమిత్తమాత్రుడినే పట్టుకుంటుంది. భగవంతుని న్యాయం, ఎవరిది తప్పో వాళ్ళని పట్టుకుంటుంది. ఆ న్యాయం ఎగ్జాక్ట్. అందులో ఎటువంటి మార్పులూ చేయలేము. ఎవరికైనా భోగవటా (సుఖ దు:ఖాల ప్రభావం) ని ఇవ్వగల చట్టమేదీ ప్రపంచంలో లేదు.

మన తప్పేదో ఉండివుంటుంది కనుకనే ఎదుటివాడు మనల్ని అంటాడు. అందువలన ఆ తప్పిదాన్ని అవగొట్టేస్తే పోలే! ఈ ప్రపంచంలో ఒక జీవి మరో జీవికి కష్టం కలిగించలేదు. అంత స్వాతంత్ర్యం ఉంది. కష్టాలను కలిగించేవారు అంతకు ముందు పొందినదాని పరిణామమే. అందువలన తప్పులను అవగొట్టేస్తే ఇక బాకీ ఏమీ ఉండదు.

జగత్తు ఉన్నది దు:ఖాలను అనుభవించటానికి కాదు, సుఖాలను అనుభవించటానికి. ఎవరి ఖాతాలో ఎంత ఉంటే అంత. కొందరు కేవలం సుఖాన్నే అనుభవిస్తుంటారు. ఎందుకలా? కొందరు కష్టాలనే అనుభవిస్తుంటారు. ఎందుకలా? వాళ్ళు స్వయంగా అటువంటి ఖాతాలను పట్టుకునివచ్చారు కనుక. ఎవరైతే దు:ఖాలను అనుభవిస్తారో, అది వాళ్ళ తప్పులే కాని, ఇతరులవి కావు. దు:ఖాన్ని కలిగించేవారి తప్పులు కావు. ఎవరైతే దు:ఖాన్ని కలిగిస్తారో, ప్రపంచంలో వాళ్ళు తమ తప్పులకు అనుభవిస్తారు. ఇది భగవంతుని నియమం.

## తన సొంత తప్పు పరిణామమే

ఎప్పుడైనా మనం ఏదైనా అనుభవించవలసివచ్చిందంటే, అది మన సొంత తప్పిదాల పరిణామమే. మన తప్పులకు కాక మనం అనుభవించవలసిన పని వుండదు. ఈ ప్రపంచంలో మనకు కించిత్ మాత్రమైనా దు:ఖాన్నివ్వగల వాళ్ళు ఎవరూ లేరు. ఎవరైనా దు:ఖాన్ని కలిగించగలిగితే అది మన తప్పిదాలే. అది ఎదుటివారి తప్పు కాదు. వాళ్ళు కేవలం నిమిత్త మాత్రులు. అందువలన, "తన తప్పులకు తానే అనుభవించాలి".

భార్యాభర్తలు బాగా దెబ్బలాడుకున్న తర్వాత, వాళ్ళిద్దరూ పడుకున్న తర్వాత నెమ్మదిగా వెళ్ళి వాళ్ళను చూడు. భార్య మంచి నిద్రలో ఉంటుంది, భర్త పక్క మీద అటు ఇటు పక్కలకు తిరుగుతుంటాడనుకోండి. అంటే తప్పు అంతా భర్తదని అర్థం చేసుకోండి. ఎందుకంటే భార్య అనుభవించటం లేదు. ఎవరి తప్పయితే వాళ్ళే అనుభవిస్తారు. ఒకవేళ ఆ సమయంలో భర్త నిద్రపోతుంటే, భార్య మేలికతో ఉంటే, తప్పంతా భార్యదేనని గ్రహించండి. 'ఎవరి తప్పుకు వాళ్ళు అనుభవిస్తారు'. ప్రపంచమంతా నిమిత్తమాత్రులనే దండించటానిక పరుగులు తీస్తుంది.

## భగవంతుని చట్టం ఎలా ఉంటుంది?

భగవంతుని చట్టం ఏమంటుందంటే, ఎక్కడ ఏ సమయంలో ఎవరైతే అనుభవిస్తుంటారో, వాళ్ళే తప్పులు చేసినవారు. ఎవరి జేబయినా కట్ అవుతే, కట్ చేసినతని ఆనందం దాని పరిణితి. అతను హోటల్‌లో టీ, టిఫిన్లు తింటుండవచ్చు. అదే సమయంలో ఎవరి జేబు కట్ అయిందో వాళ్ళు దాన్ని అనుభవిస్తుంటారు. అందుకే అనుభవిస్తున్నవాళ్ళదే తప్పు, అతను అంతకు ముందెప్పుడో దొంగతనం చేసుంటాడు. అందుకే ఈ రోజు పట్టుబడి దొంగ అయ్యాడు, జేబు కట్ చేసినవాడు పట్టుబడ్డప్పుడు దొంగ అనిపించుకుంటాడు.

ప్రపంచమంతా ఎదుటివాని తప్పులనే చూస్తుంది. అనుభవించవలసింది తనే, కానీ తప్పేమీ ఎదుటివాడిదిలా కనిపిస్తుంది. కానీ దీనివలన తప్పు రెట్టింపు అవుతుంది, వ్యవహారమూ చెడిపోతుంది. ఈ విషయాన్ని అర్థం చేసుకుంటే కష్టాలు తొలగిపోతుంటాయి.

ఈ ప్రపంచంలో నియమం ఏమిటంటే, కంటికి కనిపించేదే తప్పు అని అంటారు. కానీ ప్రకృతి నియమం ఏమిటంటే, ఎవరైతే అనుభవిస్తున్నారో, వాళ్ళదే తప్పు.

ఎవరికీ కూడా కించిత్ దు:ఖాన్ని కలిగించకు, ఎవరైనా దు:ఖాన్ని కలిగించినట్లయితో దాన్ని జమకట్టుకో. అప్పుడు మన బైఖాతాలో లెక్క పూర్తవుతుంది. ఎవరికీ ఇవ్వకండి, కొత్త వ్యాపారమేమీ మొదలుపెట్టకండి, పాతదాన్ని వదిలిపెట్టండి, అంటే లెక్క పూర్తయింది.

## ఉపకారంతో కర్మ నుండి విముక్తి లభిస్తుంది

ప్రపంచంలో ఎవరిదీ తప్పు లేదు. తప్పులెన్నే వాళ్ళదే తప్పు. ప్రపంచంలో దోషులెవరూ లేరు. అంతా వారి వారి కర్మ ఫలాలను అనుభవిస్తున్నారు. అలా అనుభవించేవారంతా ఈ రోజు ఏ తప్పు చేయటం లేదు. పూర్వజన్మల ఫలితంగా అంతా జరుగుతూవుంది. ఈ రోజు బాధపడుతున్నాడు కాని, ఆ కాంట్రాక్ట్ జరిగిపోయింది కదా, ఇప్పుడు ఏం చెయ్యగలం? దాన్ని పూర్తిచెయ్యటం తప్ప మరో దారి లేదు.

కోడలు అత్తగారిని కష్టపెడుతున్నా లేక అత్తగారు కోడలిని కష్టపెడుతున్నా, అందులో అనుభవిస్తున్నవారెవరు? అత్తగారైతే ఆమెదే తప్పు. అత్తగారు కోడలిని బాధపెడుతుంటే, అదంతా తన తప్పేనని కోడలు అర్థం చేసుకోవాలి. దాదా జ్ఞానం ఆధారంగా తెలుసుకోవలసింది ఏమిటంటే, తప్పు చేసివుండబట్టే కదా తిట్లు తినవలసివస్తుంది. అందువలన అత్తగారిని దోషిగా ఎంచగూడదు. అత్తగారిది తప్పు అంటే, కష్టం ఇంకా ఎక్కువౌతుంది, కాంప్లెక్స్ (జటిలం) అవుతుంటుంది. అత్తగారిని కోడలు బాధపెడుతున్నదంటే, దాదా జ్ఞానం ప్రకారం, అనుభవిస్తున్నవారిదే తప్పు, ఖాతాలోని ఈ బాకీని నేను పూర్తిచేసుకోవాలి అనుకోవాలి.

వదలగొట్టుకోవాలీ అంటే, తీపి, చేదు ఏదైనా (తిట్లు, అవమానాలు వగైరా), వాటిని జమకట్టుకోవాలి. లెక్క తీరిపోతుంది. ఈ ప్రపంచంలో లెక్కలో లేకపోతే కళ్ళు కూడా కలవవు. అలాంటిది మిగతావన్నీ ఖాతాలో లేకుండానే

జరిగిపోతాయా? మీది ఎంతెంత ఎవరెవరికి ఇచ్చివున్నారో అంతంత మీకు వాపసు వచ్చేస్తుంది. అప్పుడు మీరు ఆనందంగా జమకట్టుకోండి. ఇప్పుడు బైఖాతా పూర్తయింది. లేక తప్పుచేసావంటే మాత్రం తిరిగి అనుభవించ వలసివస్తుంది.

సొంత తప్పిదాలకే దెబ్బలు తింటున్నారు! రాయి విసిరిన మనిషి తప్పేమీ లేదు. ఎవరికైతే ఆ రాయి తగిలిందో వాళ్ళదే తప్పంతా. మీ పిల్లా పాపలు ఎలాంటెలాంటి తప్పులు, దుష్కర్మలు చేసినా, ఆ ప్రభావం మీమీద పడకపోతే మీ తప్పేమీ లేదని అనుకోవాలి. కానీ వాటి ప్రభావం మీమీద కూడా పడినట్లయితే, మీ తప్పు కూడా ఉన్నదని నిశ్చయంగా అనుకోవాలి.

## ఈవిధంగా విశ్లేషణ చెయ్యండి

తప్పెవరిది? అంటే, ఎవరు అనుభవిస్తున్నారో వారిది అంటారు. దీని విచారణ చెయ్యి. నౌకరు చేతిలో 10 గ్లాసులు పగిలిపోతే, దాని ప్రభావం ఇంట్లోవాళ్ళ మీద ఉంటుందా ఉండదా? ఇంట్లో చిన్నపిల్లలకు అందులో అనుభవించేదేమీ ఉండదు కానీ తల్లిదండ్రులు మాత్రం బాధపడతారు. ఆ తర్వాత కూడా అమ్మ కాసేపటి తర్వాత ప్రశాంతంగా పడుకుంటుంది. కానీ తండ్రి లెక్కలు వేసుకుంటూవుంటాడు, యాభై రూపాయల నష్టం కలిగింది కదా అని. అతను ఎక్కువ అలర్ట్‌గా ఉంటాడు కనుక ఎక్కువగా అనుభవిస్తాడు. ఇక్కడ కూడా, “అనుభవించేవాడిదే తప్పు” అతను ఈ విధంగా విశ్లేషణ చేసినట్లయితే ముందుకు సాగుతాడు, నేరుగా మోక్షానికి చేరుకుంటాడు.

**ప్రశ్నకర్త:** కొందరు ఎలా ఉంటారంటే, మనం వాళ్ళతో ఎంత బాగా ఉన్నాకానీ, అర్థం చేసుకోరు.

**దాదాశ్రీ:** వాళ్ళు అర్థం చేసుకోలేదూ అంటే, అది మీరు చేసిన తప్పు ఫలితమే. ఎదుటివారి తప్పులను చూసేవారు, కచ్చితంగా తప్పు చేస్తున్నారు.

సొంత తప్పులవలనే నిమిత్తమాత్రులు వస్తారు. ఆ నిమిత్తులు సజీవంగా ఉన్నవాళ్ళయితే వాళ్ళ మీదకు ఉరుకుతారు. అదే ఒక ముల్లు గుచ్చుకుంటే ఏం చేస్తారు? రోడ్డు కూడలిలో ముల్లు పడివుంది, అక్కడి నుండి వేల మంది నడిచిపోయారు కానీ అది ఎవరికీ గుచ్చుకోలేదు. కానీ, చందూభాయ్ నడుస్తున్నపుడు ఆ ముల్లు పక్కకి పడివున్నా సరే అతని పాదంలో గుచ్చుకుంది. ఎవరికైతే ఆ ముల్లు గుచ్చుకోవాలో వాళ్ళకే గుచ్చుకుంది. సంయోగాలన్నీ ఒక చోట కూడుతాయి. అందులో నిమిత్తునిదేం తప్పు?

నేను నా తప్పును ఎలా వెతికి పట్టుకోను అని ఎవరైనా అడిగితే, మేము ఇలా వివరిస్తాము- మీరు ఎక్కడెక్కడ వాటి ఫలాలను అనుభవిస్తారో, అవే మీ తప్పులు. ఇప్పుడిలా అనుభవిస్తున్నారంటే మీరేం తప్పు చేసివుంటారు అన్నది వెతికి పట్టుకోండి.

## మౌలికంగా తప్పు ఎక్కడుంది?

తప్పు ఎవరిది? అనుభవిస్తున్నవారిది. ఏమిటా తప్పు? అప్పుడు ఇలా చెప్తాను, "నేను చందూ భాయ్‌ని" అని నేను అనుకోవటమే మీ తప్పు. ఎందుకంటే, ఈ ప్రపంచంలో దోషులెవరూ లేరు. అందువలన నిందితులు ఎవరూ లేరు అన్నది నిశ్చయమౌతోంది.

దు:ఖాన్ని కలిగించినవారు నిమిత్తమాత్రులు. కానీ, మౌలికంగా తప్పు మీదే. మీకు ఎవరైతే లాభం చేకూర్చుతారో వాళ్ళు కూడా నిమిత్తమాత్రులే, మీకు నష్టం చేకూర్చినవారూ నిమిత్తమాత్రులే. కానీ అదంతా మీ ఖాతాలో లెక్కే కనుక అలా జరిగిపోతుంది.

## మీ తప్పులను మీరు కడుక్కునే సాధనం- ప్రతిక్రమణం
## క్రమణం, అతిక్రమణం, ప్రతిక్రమణం

ప్రపంచంలో జరుగుతున్నదంతా క్రమణం. అదంతా సహజంగా జరుగుతున్నంత కాలం అది క్రమణం. కానీ అదే ఎక్సెస్ (అధికం) అయినట్లయితే

దాన్ని అతిక్రమణం అంటారు. ఏ విషయంలో అతిక్రమణం జరిగిందో, దాన్ని వదిలించుకోవాలంటే చేయవలసింది ప్రతిక్రమణం. అంటే దాన్ని కడిగివేస్తే అది శుభ్రమౌతుంది. పూర్వ జన్మలో "ఆ ఫలానా మనిషి చెంప మీద నాలుగు వేయాలి" అనే భావాన్ని కలిగివుంటే, అది ఈ జన్మలో రూపుదిద్దుకుంటుంది. అప్పుడు నాలుగు చెంపదెబ్బలు పడతాయి. అది అతిక్రమణం అయింది అనబడుతుంది. కాబట్టి దానికి ప్రతిక్రమణం చేయవలసివుంటుంది. ఎదుటివారి శుద్ధాత్మను మనసులోకి తెచ్చుకుని, ఆ వ్యక్తి నిమిత్తంతో ప్రతిక్రమణం చేయాలి.

చెడు కార్యాచరణ జరిగితే దాన్ని అతిక్రమణం అంటారు. చెడు కార్యాచరణని మచ్చ అంటారు. అది మనసులో తొలుస్తూ (గుచ్చుకుంటూ) వుంటుంది. దాన్ని కడిగివేయటానికి ప్రతిక్రమణం చేయాలి. ఈ ప్రతిక్రమణం కారణంగా ఎదుటివారి మనసులో కూడా, మీ పట్ల భావం మారిపోతుంది. మీలో కూడా మంచి భావాలు వస్తాయి, ఇతరుల భావాలు కూడా మంచివి అయిపోతాయి. ఎందుకంటే, ప్రతిక్రమణలో అంత గొప్ప శక్తి వుందంటే, పులి కూడా కుక్కలా అయిపోతుంది. ప్రతిక్రమణం ఎప్పుడు పనికివస్తుంది. ప్రతికూల పరిణామం ఎప్పుడైనా ఎదురైతే, అప్పుడు పనికివస్తుంది.

## ప్రతిక్రమణం మీద సరైన అవగాహన

అయితే, ప్రతిక్రమణం అంటే ఏమిటి? ప్రతి క్రమణం అంటే, ఎదుటివారు మనల్ని అవమానపరిస్తే, మనం తెలుసుకోవలసింది ఏమిటంటే, ఈ అవమానానికి అపరాధి ఎవరు? ముందుగా మనం ఈ డెసిషన్ తీసుకోవాలి– ఈ పని చేస్తున్నవారు అపరాధా, లేక అనుభవిస్తున్నవారా? అయితే, అవమానిస్తున్నవారు అపరాధి ఎంతమాత్రం కారు. అతను నిమిత్తమాత్రుడు. నా కర్మ బైటికి రావటం వలన ఆ నిమిత్తుడు ఎదురయ్యాడు. అంటే ఇది నా తప్పే. ఇప్పుడు ప్రతిక్రమణం ఎందుకు చెయ్యాలంటే, అతని ప్రతి చెడు భావన

వచ్చిందంటే ప్రతిక్రమణం చెయ్యాలి. మనసులో అతని పట్ల, పనికిరానివాడు, లుచ్చా అనే భావనలు వచ్చినట్లయితే, ప్రతిక్రమణం చేయాలి. ఏమని తిట్టినా అది మన ఖాతాలోనిదే. ఈ వ్యక్తి నిమిత్తుడే. జేబు కట్ అయితే, జేబు కత్తిరించినవాడు నిమిత్తుడే. అదంతా నా ఖాతాలోనిదే. మనం ఆ నిమిత్తుడిని కొట్టటానికి పోతాం. అలాగే ఈ జగడాలన్నీ.

రోజంతా బయటి వ్యవహారాలు చేసిన తర్వాత, అందులో ఏమైనా తప్పు జరిగితే మనకి తెలిసిపోతుంది, ఫలానా వాళ్ళతో వ్యవహారం సరిగ్గా జరగలేదు అని. తెలిసిపోతుందా లేదా? మనం చేసే వ్యవహారమంతా క్రమణం. క్రమణం అంటే వ్యవహారం. ఎవరితోనైనా అది సరిగ్గా జరగలేదంటే మనకి ఎలా తెలుస్తుందంటే, ఆ వ్యక్తితో దురుసుగా మాట్లాడాం లేక అతని పట్ల మన ప్రవర్తన మంచిగా జరగలేదు. అది మనకు తెలిసిపోతుందా లేదా? అతి అతిక్రమణం అవుతుంది.

అతిక్రమణం అంటే మన వ్యవహారం వంకరగా జరగటం. దాన్ని తిన్నగా చేసుకుంటే అది ప్రతిక్రమణం.

## ప్రతిక్రమణం చేసే విధానం

**ప్రశ్నకర్త:** ప్రతిక్రమణంలో ఏం చెయ్యాలి?

**దాదాశ్రీ:** మనోవాక్కాయ యోగం. భావకర్మ- ద్రవ్యకర్మ- నోకర్మ. చందూలాల్, అతనితోపాటు చందూలాల్ అనే పేరుతో సర్వమాయకి భిన్నమైన అతని 'శుద్ధాత్మ' ని గుర్తుచేసుకుని ఇలా చెప్పుకోవాలి, "హే శుద్ధాత్మ భగవాన్! నేను గట్టిగా అరిచాను. నా చేత తప్పు జరిగింది కనుక అందుకు క్షమాపణ కోరుకుంటున్నాను. మళ్ళీ అలాంటి తప్పు చేయనని నిశ్చయించుకుంటున్నాను. మరోసారి అటువంటి తప్పు జరగకుండా చూసుకునే శక్తిని ప్రసాదించు. 'శు ద్ధాత్మ' ను కాని, లేక దాదాని గుర్తు చేసుకుని, "ఈ తప్పు జరిగింది" అని అనుకుంటే, అది ఒక ఆలోచన. ఆ తప్పుని కడిగివేసుకోవటం ప్రతిక్రమణం.

"అటువంటి తప్పు మరెన్నడూ చేయను" అని నిశ్చయించుకోవటం ప్రత్యాఖ్యానం. ఎవరికైనా నష్టం చేసినా, లేక మనసు నొప్పించినా, అవన్నీ అతిక్రమణాలు. ఆ తర్వాత వెంటనే ఆలోచన, ప్రతిక్రమణం, ప్రత్యాఖ్యానం, చెయ్యటం అవసరం.

**–జై సచ్చిదానంద**

## ప్రతిక్రమన్ విధీ

ప్రత్యక్ష "దాదా భగవాన్" సాక్షిగా దేహదరి (ఎవరి పట్ల తప్పు జరిగిందో ఆ వ్యక్తి పేరు) అతని మనస్సు – వచనం – శరీరం యొక్క యోగం, భావకర్మ, ద్రవ్యకర్మ, నొకర్మతో భిన్నమైన, ఓ శుద్ధాత్మ భగవాన్, మీ సాక్షిగా, ఈ రోజు వరకు నేను చేసిన **దోషాలన్నిటిని క్షమించమని కోరుకుంటున్నాను. హృదయపూర్వకంగా చాలా పశ్చాత్తాపపడుతున్నాను. ఆలోచన, ప్రతిక్రమన, ప్రత్యాఖానము చేస్తున్నాను. నన్ను క్షమించండి, క్షమించండి, క్షమించండి. మరియు తిరిగి ఆ దోషాలు ఎప్పుడూ చేయను అని దృఢముగా సంకల్పము చేస్తున్నాను. దాని కోసం నాకు పరమ శక్తి నివ్వండి.

** ఏఏ దోషాలు అయినాయో అవి అన్ని మనస్సులో గుర్తు చేసుకోవాలి.

- మీ వలన ఎవరికి దోషాలు జరిగిన ఆ వ్యక్తి పేరు.

- (క్రోధం – మనం – మాయ – లోభం – విషయ – వికారము, కషాయాలతో ఆ వ్యక్తికి ఎలాంటి బాధ కలిగించినా, ఆ దోషాలను మనస్సులో గుర్తు చేసుకోవాలి.)

**ఈ విధంగా ప్రతిక్రమన్ చేయడం వల్ల జీవితం చక్కగా సాగి మోక్షాన్ని కూడా పొందవచ్చు. భగవంతుడు ఇలా చెప్పాడు అతిక్రమన్ ప్రతిక్రమన్ చేస్తేనే మోక్షం లభిస్తుంది అని.**

# త్రిమందిర్ నిర్మాణం యొక్క ప్రయోజనం

ఎప్పుడైతేఎవరైనా మూలపురుషులు, ఎలా అయితేశ్రీ మహావీర్ భగవాన్, శ్రీకృష్ణభగవాన్, శ్రీరామ్ భగవాన్ సశరిరంతో హాజరైఉన్నపుడు,అపుడు వారు మనుష్యులకు ధర్మ సంబంధిత మతమతంతరాల నుండిబయటికితీసి ఆత్మధర్మంలో స్థిరపరుస్తారు. కానీ కాలక్రమానుసరంగా మూల పురుషుల అనుపస్థితిలో మెలమెల్లగా మనుషుల మధ్య విభేదాల వల్ల ధర్మంలో వేరు వేరు సంప్రదాయాలు ఉద్భవమయ్యే పరిణమస్వరూపంతో సుఖము మరియు శాంతి క్రమంగా లోపమవుతుంది.

అక్రమ విజ్ఞానీ పరమ పూజ్యనీయ శ్రీ దాదా భగవాన్ ప్రజలకు ఆత్మదర్మ ప్రాప్తి కలిగించారు మరియు దానితో పాటు ధర్మంలో ప్రబలంగా ఉన్న గొడవలను దూరం చేసి,ప్రజల మధ్య సంకుచిత ధార్మిక పక్షపాతం యొక్క ప్రమాదాలనుండి తొలగించడానికిఒక ప్రత్యేకమైన, క్రాంతికారిచర్య తీసుకున్నారు, అది సంపూర్ణ నిష్పక్షపాతి ధర్మ సంకుల్ నిర్మించడమూ.

మోక్షం యొక్క ధ్యేయన్ని నెరవేర్చడానికిశ్రీ మహావీర్ స్వామి భగవాన్ జగతుకు ఆత్మ జ్ఞాన్ ప్రాప్తి యొక్క మార్గం చూపించారు. శ్రీకృష్ణభగవాన్ గీతా ఉపదేశంలో అర్జునుడికి"ఆత్మవత సర్వభూతేషు" యొక్క దృష్టిని ప్రసాదించాడు. జీవ మరియు శివ మధ్య భేదం తొలగిస్తేమనం సొంతంగా శివ స్వరూపం ఆయి చిదానంద రూప శివోహం శివోహం, యొక్క దశని ప్రాప్తిస్తాము. ఈ విధంగా అన్నీ ధర్మా ల మూలపురుషులు హృదయ కోరిక ఆత్మజ్ఞానం పొందలనేదే ఉన్నది. ఒకవేళ ఈ విషయం అర్థం చేసుకుంటేదానికి పురుషార్థం మొదలవుతుంది మరియు ప్రతి ఒక్కరినీ ఆత్మదృష్టితో చూడడం ద్వారానే అభేదతా ఉత్పన్న మవుతుంది. ఏ ధర్మాన్ని ఖందించకూడదు, ఏ ధర్మం యొక్క ప్రమానికతను బాధ కలుగకూడదనే భావన నిరంతర కొనసాగుతూనే ఉంటుంది.

పరమ పూజ్యనియ దాదా భగవాన్ (దాదాశ్రీ) చెప్పేవారు తెలిసితెలియాక ఎవరికైనా విరాధన జరిగితే వారందరికీ ఆరాధన అవ్వడం వల్ల అన్ని విరాధనలు తొలిగిపోతాయి. ఇలా నిష్పక్షపాత త్రిమందిర్ సంకులలో ప్రవేశించి అందరూ భాగవంతులా విగ్రహాల ముందు సహజంగా తలవంచినప్పుడు లోపలివి అన్నీ నమ్మకాలు తొలిగి మరియు నిరాగ్రహి అవుతారు.

దాదా భగవాన్ పరివారం యొక్క కేంద్రం త్రిమందిర్ అదాలజ్‌లో ఉన్నది. దానితో పాటుగా గుజరాత్ యొక్క అహ్మదాబాద్, రాజ్కోట్, మోర్బి, అమ్రెల్లి, సురేంద్రనగర్, భుజ్, గోధ్రా, భదారన్, చలామాలి, మరియు వాసనా (జి.వడోదర) మొదలైన ప్రదేశాలలో నిష్పక్షపాత త్రిమందిరాన్ని నిర్మించారు. ముంబై, వడోదర మరియు అంజార్‌లో త్రీమందిర నిర్మాణ పనులు జరుగుతున్నాయి.

**జ్ఞాన్ విధి అంటే ఏమిటి?**

1) ఇది భేద జ్ఞానం యొక్క ప్రయోగం, ఇది ప్రశ్న – జవాబుల సత్సంగం కంటే భిన్నమైనది.

2) 1958 లో పరమ పూజ్య దాదా భగవాన్‌కి ఆత్మజ్ఞానం ప్రకటిమైనది. అదే జ్ఞానం ఈ రోజు కూడా ఆయన కృప ద్వారా మరియు పూజ్య నిరూమా ఆశీర్వాదంతో, పూజ్య దీపక్ భాయ్ ద్వారా లభిస్తుంది.

**జ్ఞానాన్ని ఎందుకు పొందాలి?**

1) జన్మ – మరణ చక్రాల నుండి విముక్తి పొందడానికి.

2) స్వంత ఆత్మను మేల్కొలపడానికి.

3) కుటుంబ సంబంధాలు మరియు పనిలో ఆనందం – శాంతిని అనుభవించడానికి.

**జ్ఞాన్ విధి ద్వారా ఏమి సాధించవచ్చు?**

1) ఆత్మ జాగృతి ఏర్పడుతుంది.

2) సరైన అవగాహనతో జీవన – వ్యవహారం పూర్తి చేయడానికి కీలు ప్రాప్తిస్తాయి.

3) అనంత కాలం యొక్క పాపాలు భస్మీభూతం అవుతాయి.

4) అజ్ఞాన నమ్మకాలు తొలిగిపోతాయి.

5) జ్ఞాన్ జాగృతిలో ఉండటం వలన కొత్త కర్మలు బంధించబడవు మరియు పాత కర్మలు నాశనం అవుతాయి.

**ఆత్మజ్ఞానం ప్రాప్తికి ప్రత్యక్షంగా (వ్యక్తిగతంగా) రావడం అవసరమా?**

1) ఆత్మజ్ఞానం, జ్ఞాని యొక్క కృప (అనుగ్రహం) మరియు ఆశీర్వాదం యొక్క ఫలితం. దీని కొరకు ప్రత్యక్షంగా రావడం అవసరము.

2) పూజ్య నిరుమా మరియు పూజ్య దీపక్ భాయ్ యొక్క టి.వి. లేదా వి.సి.డి. సత్సంగ్ కార్యక్రమాలు మరియు దాదాజీ పుస్తకాలు, జ్ఞానం యొక్క పత్రతను సిద్ధం చేయగలవు. కానీ ఆత్మ సాక్షాత్కారాన్ని అందించలేవు.

3) ఇతర మార్గాల ద్వారా ఖచ్చితంగా శాంతిని పొందవచ్చు కానీ పుస్తకంలో చిత్రించబడిన దీపం కాంతిని ఇవ్వదు, కానీ ప్రత్యక్ష దీపం మాత్రమే కాంతిని ఇస్తుంది. అదే విధంగా ఆత్మను మేల్కొలపడానికి, స్వయంగా వచ్చి జ్ఞానాన్ని పొందవలెను.

- **జ్ఞానాన్ని పొందడానికి మతాన్ని లేదా గురువును మార్చవలసిన అవసరం లేదు. జ్ఞానం అమూల్యమైనది.**
- **కాబట్టి దానిని పొందడానికి ఏమి చెల్లించాల్సిన అవసరం లేదు.**

# తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | |
|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు |
| 2. | విభేదాలను తొలగించడానికి |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది |
| 4. | బాధితుడు తప్పిదము |
| 5. | క్రోధం |
| 6. | చింత |
| 7. | నేను ఎవరు? |
| 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 10. | ఆత్మ సాక్షాత్కారం |
| 11. | మానవ ధర్మం |
| 12. | సేవ, పరోపకారం |
| 13. | ప్రతిక్రమణ |
| 14. | భార్యాభర్తల దివ్య వ్యవహారం |
| 15. | అంతఃకరణ స్వరూపం |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

❖ All Dada Bhagwan books and magazines are also available on online book store : https://store.dadabhagwan.org

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**'Dada Bhagwan Foundation Telugu' Channel:**

https://dbf.adalaj.org/yttelugu

*Open Link OR*

*Scan QR*

---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 7200740000 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9885058771 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar**: | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org



## జ్ఞానవిధి

జ్ఞానవిధి, అనంత జన్మల నుండి, తన నిజ స్వరూపం, ఆత్మస్వరూపాల అనుభూతి కోసం తపించే ముముక్షువుల కోసం, జ్ఞానీ పురుష్ పరమ పూజ్య దాదా భగవాన్ వారి అక్రమ విజ్ఞానం ద్వారా ఆత్మ సాక్షాత్కారం పొందేందుకు ఇచ్చిన అమూల్యమైన బహుమతి. జ్ఞానవిధి, 'నేను' (ఆత్మ), 'నా' (మనోవాక్కాయాలు) మధ్య వాటిని విడదీసే రేఖను గీసేది, జ్ఞానీ పురుషుని విశేష ఆధ్యాత్మిక సిద్ధి ద్వారా జరిగే జ్ఞాన ప్రయోగం. ఈ ఆత్మజ్ఞానంతో శాశ్వత ఆనందం ప్రాప్తిస్తుంది, చింతల నుండి విముక్తి కలుగుతుంది. ప్రాపంచిక సంబంధాలు శాంతిమయమౌతాయి, వ్యావహారిక సమస్యలకు సమాధానం లభించేటట్టు చేయటంలో ఉపకరిస్తుందని నిరూపితమైంది.

–దాదాశ్రీ

dadabhagwan.org

9 789391 375621

Printed in India

Price ₹45